



# రామ్, శ్యామ్‌ల ధననిధి వేట





















ప్రతి గ్రంథాలయంలోను
ఉండితీరాలి!



శ్రీమతి మధురం భూతలింగం
రచించిన ఇంగ్లీషు పుస్తకాలు

**'SONS OF PANDU'**
Rs. 5-25

**'THE NECTAR OF THE GODS'**
Rs. 4-00

పిల్లలకు బహుమతిగా
ఇవ్వతగినవి.



కాపీలకు:

## డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# ఇదుగో వచ్చింది స్కాలర్!

## బ్లాక్‌బర్డ్ వారి నుంచి విద్యార్థులకు అతి చక్కని పెన్ను



ఇప్పుడు బ్లాక్‌బర్డ్ వారు
ప్రత్యేకంగా విద్యార్థుల కోసం
'స్కాలర్'ను సృష్టించారు—
తేలికై సుందరమైన ఆకారంతో
చక్కగా చేతికి అమిరేందుకు
...పట్టులాగా సాఫీగా జారువారే
సిరాకోసం అతి సన్నని
ఇరిడియం కొనగల పాళీతో.
దానిని చూడండి. పరీక్షించండి.
పూర్తి మార్కులు పొందగల
అర్హత ఈ పెన్నుదేనని
మీరు అంగీకరిస్తారు:

స్కాలర్ పెన్ను—
ప్రపంచ ప్రఖ్యాత బ్లాక్‌బర్డ్
పరివారం నుంచి మరొక
నాణ్యమైన పెన్ను

heros'-SI-132A TEL



అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్ జీర్ణశక్తిని సరిచేస్తుంది. దానికి తోడ్పడుతుంది. బిడ్డని ఆరోగ్యంగా. సంతోషంగా ఉంచుతుంది




అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్ నులినొప్పి. వాయువు. అజీర్ణం పళ్లు వచ్చే కాలంలో ఇబ్బందులు వాటికి మంచి గుణం ఇస్తుంది.

అమృతాంజన్ లిమిటెడ్

## బిడ్డ సంతోషంగా ఉంటె
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్ వాడినట్లే

OBM:2642 TG

---

AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.

## బెణుకు
తక్షణం తగ్గిపోయింది!

# అమృతాంజనం

AM/7573

**తలనొప్పి, జలుబు, ఇతర బాధలను నిరపాయంగా చప్పున పోగొడుతుంది**

బెణుకులు, కండరాల నొప్పి, వళ్లునొప్పి, తలనొప్పి, జలుబులు—చప్పున తగ్గాలంటే అమృతాంజనం వాడండి. బాధగా వున్నచోట అమృతాంజనం రాయండి. తక్షణం బాధ మాయమవుతుంది. అమృతాంజనం చిన్న సీసాలలోనూ, ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, తక్కువ ధరకి లభించే చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.

అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది. అమృతాంజన్ లిమిటెడ్



రవీంద్ర ఆర్ట్ పిక్చర్స్

# డాక్టరు బాబు

ఈస్ట్‌మన్ కలర్

నిర్మాత: తమ్మారెడ్డి కృష్ణమూర్తి    దర్శకత్వం: టి. లెనిన్ బాబు B.Sc.,

సంగీతం: తాతినేని చలపతిరావు

మాటలు: మోదుకూరి జాన్సన్

కెమెరా: కన్నప్ప

సాంకేతిక సహకారము: లక్ష్మీ కంబైన్స్.

లక్ష్మీ ఫిలింస్ రిలీజ్

LAKSHMI

# పిల్లలకు నేర్పించవలసినవి ఎన్నో వున్నాయి




## కొన్ని కొన్ని వారే తెలుసుకుంటారు

ఏ మిఠాయిలు శ్రేష్ఠమైనవోలాగా....ఇవి పిల్లలలో రూఢిగా జరిగే సంఘటన, పొంగరాలు, గోలీలు, క్యాండీలు నేర్పేదికే. మధురపూరితమైన న్యూట్రిన్ మిఠాయిల శ్రేష్ఠత గురించి పిల్లలు చెప్పేటప్పుడు సరియైన కారణం వుండని మీరు ఒప్పుకోరేటప్పుడు.

స్వచ్ఛమైన పాలు, చక్కెర, తేనెల ఫలితమైన కాఫీ టాఫీలు, కోకోనట్ డ్రాప్ డ్రాప్‌లు, ఆరెంజ్ క్యాండీలు, లాక్టో డ్రాప్ డ్రాప్‌లు—ఇవి కొన్ని రకాలు, పిల్లలు వీటిని ఏడిచేరు.




**న్యూట్రిన్** ఒక్కొక్క మిఠాయి యందు ఫలరస పూరిత విందు

న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, పలమనేర్ రోడ్, చిత్తూరు (ఆం.ప్ర.)







# మీ పాత టైరులను
# కొత్తవిగా చేయుటకు -
# టివిఎస్ రిట్రెడింగ్ సర్వీసు




**సుందరం ఇండస్ట్రీస్ ప్రైవేట్ లిమిటెడ్**
**మద్రాసు- 600006**

బెంగళూరు - కోయంబత్తూరు - కలమశేరి - పుదుక్కోట - సేలం - సికిందరాబాదు — తిరునల్వేలి -
విజయవాడ - విశాఖపట్నం - మంగళూరు - మధురై

SAA/51/1133



# చందమామ

సంస్థాపకుడు : నాగిరెడ్డి
సంచాలకుడు : 'చక్రపాణి'

ఈ నెల బేతాళకథ ["అసలు కారణం"] రచించినది "వసుంధర."

ప్రపంచం ధనమూలకమని పెద్దలు చెబుతారు. సమస్త సుఖాలూ దాని మీద ఆధారపడి ఉన్నాయి. డబ్బుగల వాడికి సంఘంలో ఆదరం ఉన్నది. వాడు దాన ధర్మాలు చేసి కీర్తి ప్రతిష్ఠలు సంపాదించగలడు. అయితే డబ్బు అన్ని పాపాలకూ కూడా మూలకారణమవుతున్నది. దానిపై అవిశ్వాసం కూడా చెరుపు చెయ్య గలదన్నది "అసలుకారణం" నిరూపిస్తుంది.

సంపుటి 53 డిసెంబర్'73 సంచిక 6

CP

CHITRA



# అమరవాణి

గుణాః ఖలు గుణా ఏవ
న గుణా భూతిహేతవః,
ధనసంచయకర్తృణి
భాగ్యాని పృథగేవ హి. 1

[సద్గుణాలు కేవలమూ సద్గుణాలే గాని, అవి ఐశ్వర్యం కలిగించవు, ధనం చేకూర్చటానికి అదృష్టం అనేది వేరే ఉన్నది.]

ఆత్మాయత్తే గుణగ్రామే,
నైర్గుణ్యం వచనీయతా,
దైవాయత్తేషు విత్తేషు
పుంసాం కా నామ వాచ్యతా? 2

[సద్గుణాలు స్వశక్తితో సంపాదించుకునేవి. అవి లేకపోవటం తప్పు. దైవికంగాకలిగే డబ్బు లేకపోతే అందులో తప్పేమీ లేదు.]

యస్యాస్తి విత్తం స నరః కులీనః,
స పండిత, స్స శ్రుతవాన్, విధిజ్ఞః,
స ఏవ వక్తా, స చ దర్శనీయః,
సర్వే గుణాః కాంచన మాశ్రయంతి. 3

[ఎవడి వద్ద డబ్బు ఉంటుందో వాడే కులీనుడు, వాడే పండితుడు, వాడే శాస్త్రజ్ఞుడు, వాడే కర్తవ్యం తెలిసిన వాడు, వాడే మాటకారి, వాడే అందగాడు. సమస్త సద్గుణాలూ డబ్బు వెంట ఉంటాయి.]

---

సద్గుణాలు




# యక్షపర్వతం

## 19

[వీరపురరాజు ఆజ్ఞాపించగా, సేనానాయకుడు గుర్రపురౌతుల్నీ, కాల్బలాన్నీ వెంట బెట్టుకు పోయి, కొండ మీద వున్న స్వర్ణాచారిని లొంగిపొమ్మని హెచ్చరించాడు. సమరబాహు అనుచరులు, వీరపురసైనికుల మీదికి గురిచూసి ఈటెలను విసిరారు. అందులో ఒకటి రయ్యమంటూ వచ్చి వీరపురసేనాని భుజంలో గుచ్చుకున్నది. తరవాత—]

సమరబాహు అనుచరులు విసిరిన ఈటె దెబ్బ తింటూనే వీరపురసేనాని ఒక చావు కేక పెట్టి గుర్రం మీది నుంచి కింద పడిపోయాడు. ఆ పడే సమయంలో అతడి భుజంలో గుచ్చుకుని వున్న ఈటె జారి పక్కనపడింది. అతణ్ణి సైనికులు దూరంగా తీసుకుపోయి, గాయానికి కట్టుకట్టారు.

స్వర్ణాచారి, సమరబాహు అనుచరులను మెచ్చుకుంటూ, "మొదటి దెబ్బకే మనం శత్రువుల్ని హడలకొట్టాం. మనం లెక్కకు ఇరవై ఆరుగురమే అయినా శత్రువులు ఈ దెబ్బతో మన బలాన్ని మరింత ఎక్కువని అంచనా వేస్తారు. అలా జరిగితే వాళ్ళు సాహసించి కొండ ఎక్క ప్రయత్నం చేయరు," అన్నాడు.

ఆ మాట వింటూనే సమరబాహు అనుచరు డొకడు, "ఆచార్య మహామంత్రీ! శత్రువులు ఒక వేళ సాహసించి కొండ



వచ్చి, "ఆచార్యమహామంత్రీ! శత్రువుల మీదికి దాడిచేయటానికి ఇది మంచి సమయంలా కనిపిస్తున్నది. ఆజ్ఞయివ్వండి, మేమంతా పోయి గుంపుగావున్న వాళ్ళ మీదపడి, మా ఈటెలకు వాళ్ళను ఎరచేసి, వాళ్ళెక్కివచ్చిన గుర్రాలను పట్టుకుంటాం," అన్నారు.

సమరబాహు అనుచరుల ధైర్యసాహసాలు స్వర్ణాచారికి ఆనందం కలిగించినా, వాళ్ళు కొండ దిగిపోయి శత్రువుల మీద దాడి చేస్తామనటం మాత్రం వట్టి దుస్సాహసంలా కనిపించింది. అతడు వాళ్ళతో, "మీరు తొందర పడకండి. సంఖ్యలో శత్రువులు మనకన్న పదింతలున్నారు. మనం దాడి చేసేందుకు కొండదిగుతున్నట్టు చూడగానే వాళ్ళు క్షణాల మీద సర్వ సన్నద్ధులై మనను చుట్టుముట్టి హతమార్చ గలరు. మన ఒంటెలన్నిటినీ కొండ అవతల వున్న పల్లపు ప్రాంతంలో జాగ్రత్త పరిచారు గదా?" అన్నాడు.

"వాటన్నిటినీ ఒక చోట మందవేసి ఇద్దర్ని కాపలా పెటాం. ఇప్పుడు మీ ఆజ్ఞ ఏమిటి? శత్రువులు మన ఈటే, వడిశెల దెబ్బలకు అందనంత దూరంపోయి నిల బడ్డారు. వాళ్ళక్కడా, మనం ఇక్కడా, అంతేనా?" అన్నారు సమరబాహు అను చరు లిద్దరూ.

ఎక్కాలని చూశారో, మనం నియోగించిన ఆటవికులు వాళ్ళ మీదికి సింహాన్ని, పులులనూ వదిలి చీకాకు పరుస్తారు," అన్నాడు.

స్వర్ణాచారి కొండ దిగువనున్న వీరపుర సైనికుల కేసి చూశాడు. వాళ్ళల్లో ఇప్పుడు కొద్ది మంది మాత్రమే గుర్రాల మీద వున్నారు. మిగతా వాళ్ళంతా గాయపడిన తమ సేనాని చుట్టూ చేరి అతడు బాధతో మూలుగుతూ, మధ్య మధ్య కొండ మీది కోటను పట్టుకునేందుకు ఏం చేయాలన్న దాన్ని గురించి యిచ్చే ఆజ్ఞలను జాగ్రత్తగా వింటున్నారు.

సమరబాహు అనుచరుల్లో బాగా ధైర్యశాలు లైన యిద్దరు స్వర్ణాచారి దగ్గిరకు

వాళ్ళ మాటలకు స్వర్ణాచారి నవ్వి, "యుద్ధం అప్పుడే ముగిసిపోయిందని భ్రమపడకండి. ఆ శత్రు సేనానాయకుడు గాయపడినంత మాత్రాన తిరిగి వెళ్ళిపోతా డనుకుంటున్నారా? అలా చేస్తే వీరపురరాజు అతణ్ణి పిరికిపందగా ప్రకటించి ఉరితీయిం చేస్తాడు," అన్నాడు.

స్వర్ణాచారి యిలా చెపుతూండగానే వీర పుర సైనికుల్లో కొందరు పరిగెత్తుకుంటూ పోయి గుర్రా లెక్కారు. కాల్బల సైనికులు ఈటెలు పైకెత్తి నిలబడి కొండపైకి చూడ సాగారు. అంతలో ఇద్దరు సైనికులు పట్టి ఎత్తి సేనానాయకుణ్ణి ఒక గుర్రం మీద కూర్చోబెట్టారు. నలుగురైదుగురు అశ్వికులు వెంటరాగా సేనాని గుర్రాన్ని మెల్లిగా పరి గెత్తిస్తూ కొండ దిగువ భాగాన్ని పరీక్షించి చూడసాగాడు.

శత్రుసేనాని వాలకం చూస్తూనే స్వర్ణా చారికి అతడు కొండ ఎక్కేందుకు సులు వైన మార్గం కోసం వెతుకుతున్నట్టు అర్థమై పోయింది. అతడికి సమరబాహు అను చరులు రోజూ కొండ ఎక్కి దిగే చక్కని కాలిబాటను గుర్తించటం ఏ మంత కష్టం కాదు. స్వర్ణాచారి, సమరబాహు అనుచరు లను మళ్ళీ వడిసెలలూ, ఈటెలూ విసిరేం దుకు సిద్ధంగా వుండమని హెచ్చరించి, ఒక అనుచరుణ్ణి వెంటబెట్టుకుని, ఆట



వికులు సింహం, పులులతో వున్న చోటుకు వెళ్ళాడు.

స్వర్ణాచారిని చూస్తూనే ఆటవికులు సంతోషంగా లేచి నిలబడి, అతడికి దణ్ణాలు పెటారు. వాళ్ళ నాయకుడు స్వర్ణాచారితో, "మహారాజా! వీరపురంరాజు సైనికులకన్న మీ సైనికులే ఎక్కువ ధైర్యవంతులూ, యుద్ధాల్లో ఆరితేరినవాళ్ళలా కనిపిస్తు న్నారు. మొదటి దెబ్బకే ఈటె విసిరి శత్రు సేనానాయకుణ్ణి హతం చేశారు," అన్నాడు.

"వాడు చావలేదు, గాయపడ్డాడు, అంతే! ఈసారి శత్రువులు కొండ దిగువున వుండి లొంగిపొమ్మని హెచ్చరికలు చేయటం



కాకుండా, అసంపూర్తిగా వున్న కోటను పట్టుకునేందుకు కొండ ఎక్కి రాబో తున్నారు. వాళ్ళు పైకి వచ్చేందుకు యిక్కడున్న కాలిబాటే సులువైనది. మీరు అదను చూసి శత్రువుల మీదికి వదిలేందుకు సింహాన్నీ, రెండు పులులనూ తయారుగా వుంచారా?" అని అడిగాడు స్వర్ణాచారి.

ఆటవికుల నాయకుడు, స్వర్ణాచారిని కాలిబాట పక్కనే వున్న చిన్న గుహల దగ్గిరికి తీసుకుపోయాడు. సింహం బోను ఒక గుహ ముందు భాగాన వున్నది, పులులున్న బోనులూ అలాగే మరొక గుహ ముందున్నవి. ఆ బోనుల మీద ఇద్దరిద్దరు ఆటవికులు ఎక్కి కూర్చునివున్నారు.

స్వర్ణాచారికి, ఆటవిక నాయకుడు తన అనుచరులను చూపించి, "చూశారా, మహారాజా! వీరపుర సైనికులు యీ దాపులకు రాగానే మా వాళ్ళు బోనుల తలుపులెత్తేసి, గుహ పై భాగానికి పారిపోతారు. ఆకలిగొని వున్న క్రూరమృగాలు ఎదురుగా కాలిబాట మీద కనిపించే శత్రువుల మీదికి పోయి పడి చీల్చి చెండాడుతవి," అన్నాడు.

"అవి వాళ్ళ మీదికి పోయి పడనూ వచ్చు లేక బోనుల్లో నుంచి విముక్తి కలిగిందని కొండ దిగి అరణ్యంలోకి పారిపోనూ వచ్చు. ఏమైనా మీ ప్రయత్నం మీరు చెయ్యండి. ఒక మాట, నేను మహారాజును కాదు; ఆయన మంత్రిని. మీ సహాయానికి మా రాజు నుంచి తప్పక ఘనమైన ప్రతిఫలం వుంటుంది, గుర్తుంచుకోండి," అన్నాడు స్వర్ణాచారి.

స్వర్ణాచారి, ఆటవికులతో మాట్లాడి తిరిగి సమరబాహు అనుచరుల దగ్గిరకు వచ్చి కొండ దిగువకు చూశాడు. ఈ సారి వీరపుర సేనాని కొండమీది వాళ్ళను లొంగిపొమ్మని ఆజ్ఞాపించి లాభం లేదని గ్రహించి, కొండ మీది కోటను పట్టుకునేందుకు కొత్త పథకం వేశాడు. కాల్బల సైనికులు ముందుగా కాలిబాట వెంట కొండ ఎక్కటం ప్రారంభించారు. వాళ్ళల్లో కొందరి దగ్గిర విల్లంబులున్నవి. పైనుంచి సమరబాహు

అనుచరులు ఈటెనుగాని, వడిసెలతో రాళ్ళనుగాని విసిరినప్పుడల్లా, సైనికులు ఆగి, వాళ్ళకేసి బాణాలు కొడుతున్నారు.

వీరపుర సైనికుల్లో కొందరు చచ్చినా, మిగతా వాళ్ళు కొండమీదికి చేరగలరనీ, అప్పుడు జరిగే బాహాబాహి యుద్ధంలో తన వెంట వున్న ఇరవై ఆరు మందితో, అంత సేనను ఓడించటం అసంభవమనీ స్వర్ణాచారి గుర్తించాడు. అతడు సమరబాహు అనుచరులతో, "మనం సాధ్యమైనంత మంది శత్రువులను చంపి యిక్కణ్ణుంచి అరణ్యంలోకి పారిపోవటం తప్ప మరో మార్గాంతరం లేదు. ముందుగా ఇద్దరు ముగ్గురు పోయి, పారిపోయేందుకు వీలుగా ఒంటెలను సిద్ధపరచండి. ఇప్పటికే వాటి దగ్గిర మనవాళ్ళిద్దరున్నారు," అని చెప్పాడు.

ఈ లోపల వీరపుర సైనికులు బాణాలు వదులుతూ కాలి బాట వెంట కొండ ఎక్కసాగారు. సేనానాయకుడు మాత్రం కొండ దిగువున వుండి; గుర్రపు రౌతులకు ఏవో ఆజ్ఞలిస్తున్నాడు. వాళ్ళల్లో కొందరు కాల్బల సైనికులకు కొంచెం వెనకగా కొండ ఎక్కసాగారు.

"ఉష్ట్రవీరుల్లారా! తెలివి తక్కువ కొద్దీ వీరపురసేనాని అశ్వికులు కొందర్ని కొండమీదికి పంపుతున్నాడు. మన ఒంటెల దళం యిక్కడ వున్నదనుకుంటున్నాడో



ఏమో! మీలో కొందరు పైనుంచి కాలి బాట మీదికి రాళ్ళు దొర్లించండి. మిగతా వాళ్ళు గురి చూసి వడిసెలలు ప్రయోగించండి!" అని ఆజ్ఞాపించాడు స్వర్ణాచారి.

సమరబాహు అనుచరుల్లో కొందరు పెద్ద పెద్ద రాళ్ళను నెట్టుకువచ్చి కాలి బాట వెంట పైకి వస్తున్న వీరపుర సైనికుల కేసి దొర్లించారు. కాని, వాటిల్లో చాలా భాగం దారిలో వున్న ఎత్తు పల్లాల్లో పడి లేస్తూ, గురి తప్పి మరో మార్గాన దొర్లుకుంటూ పోసాగినై. సమరబాహు అనుచరుల ప్రయత్నం విఫలం కావటం చూస్తున్న వీరపుర సైనికులు ఉత్సాహంగా కేకలు వేస్తూ, పైకి రాసాగారు. వాళ్ళను అను



సరించి వస్తున్న అశ్వికులు కత్తులు దూసి పైకెత్తి పట్టుకుని, వీరపుర రాజుకు జయ ధ్వానాలు చేయసాగారు.

అలాంటి ఉత్సాహ సమయంలో వాళ్ళు, ఆటవికులు సింహం, పులులతో వున్న గుహల ప్రాంతాన్ని చేరారు. ఆటవికులు సింహం, పులులను వాళ్ళ మీదికి వదులుతారా లేక భయపడి పారిపోతారా అన్న సంశయంలో కొట్టుమిట్టాడుతున్న స్వర్ణాచారికి హఠాత్తుగా సింహ గర్జన, పులుల గాండ్రింపూ వినిపించింది. మరుక్షణం సింహం, పులులూ బోనుల్లో నుంచి కుప్పించి బయిటికి దూకి, అందుబాటులో వున్న వీరపుర సైనికుల మీద పడినై.

సైనికుల్లో హాహాకారాలు బయలుదేరినై. హఠాత్తుగా వచ్చిన ఈ దాడిని ఎదుర్కోనేందుకు వాళ్ళు సిద్ధంగా లేరు. వాళ్ళల్లో నలుగురైదుగురు సింహం, పులుల పంజా దెబ్బలు తిని కింద పడిపోయారు. వాటికి అందకుండా పారిపోవాలని చూసిన మరి కొందరు రాళ్ళ మీద కాళ్ళ పట్టు తప్పి తలకిందులుగా పడిపోయి కొండ కిందికి దొర్లసాగారు.

ఈ గందరగోళంలో సైనికుల వెనక వస్తున్న అశ్వికుల గుర్రాలు బెదిరి, చప్పున వెనుదిరిగి పారిపోబోయి, రౌతులతో పాటు కాళ్ళు జారి కిందపడి పల్టీ మీద పల్టీ కొడుతూ కొండ దిగువకు పోయి పడినై. కన్ను మూసి తెరిచేంతలో జరిగిపోయిన ఈ దుస్సంఘటన చూసి, అసలే గాయం బాధలో వున్న వీరపుర సేనాని నిశ్చేష్టుడై పోయాడు. ఆటవికులు వదిలిన సింహం, పులులూ యిక ఆ ప్రాంతాల తమకడ్డొచ్చే వాళ్ళెవరూ లేకపోవటంతో, రాళ్ళ మీంచి కుప్పించి దూకుతూ చేరువలో వున్న అరణ్యం కేసి పరిగెత్తినై.

కొండ ఎక్క చూసిన సైనికుల్లోనూ, అశ్వికుల్లోనూ కొంతమంది చావగా, మిగిలిన వాళ్ళు కుంటుతూ, కొందరు ఒకళ్ళనొకళ్ళు ఆసరాగా పట్టుకునీ కొండ దిగువకు పోసాగారు. అది చూసిన సమరబాహు

అనుచరులు, స్వర్ణాచారితో, "ఆచార్య మహామంత్రీ! అజ్ఞ యివ్వండి. ఇప్పుడే దాడి చేసి ఆ గాయపడి పారిపోతున్న శత్రువులను ఈటెలతో పొడిచి చంపి వస్తాం," అన్నారు.

స్వర్ణాచారి వాళ్ళ మాటలు విన్నాడు గాని వెంటనే జవాబివ్వలేదు. తాను ఓడించిన శత్రుసైనికులు, కోట ముట్టడికి వచ్చిన వాళ్ళలో పదవ వంతు వుండరు. మిగిలిన వాళ్ళంతా మరోసారి దాడి చెయ్యటానికి కొండ కింద సిద్ధంగానే వున్నారు. ఈ సారి దాడి వస్తే, యిందాకటిలా హఠాత్తుగా వాళ్ళ మీద పడి చిందరవందర చేసేందుకు సింహంగాని, పులులుగాని లేవు...

ఇప్పుడు కొండ దిగువున వీరపుర సేనాని తన సైనికులనందర్నీ ఒక చోట చేర్చి ఏదో మాటాడుతున్నాడు. ఆశ్వికుల్లో కొందరు ఆ సరికే కొండ రెండవ తట్టున ఏమున్నదో చూసి వచ్చేందుకు పోయారు. స్వర్ణాచారి, సమరబాహు అనుచరులకు శత్రువులను చూపుతూ, "సాహసం వేరు, దుస్సాహసం వేరు! యుద్ధంలో దుస్సాహసం పనికి రాదు. చూడండి, శత్రుసేనాని మరొక సారి మన మీదికి దాడి వచ్చేందుకు తయారవుతున్నాడు. ఈ సారి యిక్కడున్న కొద్ది మందిమీ ఆశ్వికుల్నీ, కాల్బల సైనికుల్నీ కూడా ఎదుర్కొని ద్వంద్వయుద్ధం



చేయవలసి వస్తుంది. అంతమంది శత్రువుల్ని జయించటం మనవల్ల కాదు. మనం వెంటనే యిక్కణ్ణించి పోయి, కొండపక్క పల్లపు ప్రదేశంలో దాచిన మన ఒంటెల నెక్కి అరణ్యంలోకి పోదాం. అక్కడ క్షత్రియయువకులూ, సమరబాహు మహారాజు కూడా కనిపించవచ్చు." అన్నాడు.

"సింహం, పులుల బోనుల దగ్గిరున్న ఆటవికులేమైనట్టు? వాళ్ళు సాయం వస్తే శత్రువుల్ని జయించటం ఏమంత కష్టం కాదు," అన్నాడొక సమరబాహు అనుచరుడు.

"వాళ్ళు శత్రుబలం చూసి భీతిచెంది చల్లగా అరణ్యంలోకి పారిపోయి వుంటారు. మూక ఉమ్మడిగా శత్రుబలగం మన

మీదికి వచ్చి పడకముందే మనం కూడా అదే పని చెయ్యాలి," అన్నాడు స్వర్ణాచారి.

"కానీ, ఆచార్య మహామంత్రీ! మనం పారిపోతే, శత్రువు మనను పిరికివాళ్ళని...." అంటూ సమరబాహు అనుచరుడొకడు ఏమో చెప్పబోయేంతలో, ఒంటెలను కావలి కాసేందుకు వెళ్ళిన వాళ్ళల్లో ఒకడు రొప్పుతూ స్వర్ణాచారి దగ్గిరకు పరిగెత్తుకుంటూ వచ్చి, "ఆచార్య మహామంత్రీ! అయిదుగురు శత్రు రౌతులు మన ఒంటెలున్న చోటు తెలుసుకుని, మేం వెంటబడి తరమబోయేంతలో పారిపోయారు. ఈ సారి వాళ్ళు గుర్రాల మీద పెద్ద ఎత్తున దాడి వస్తారని నా అనుమానం!" అన్నాడు.

"అనుమానం కాదు, వాళ్ళు చేయబోయేదే అది! వాళ్ళు మన ఒంటెల్ని పట్టుకున్నారో, మనం ఎందుకూ కొరగానివాళ్ళమైపోయి, వాళ్ళ చేతుల్లో బలిపశువుల్లా చిక్కిపోతాం. అందరూ ఒంటెలున్న చోటుకు బయలుదేరండి!" అంటూ స్వర్ణాచారి ముందుండి దారితీశాడు.

స్వర్ణాచారీ, సమరబాహు అనుచరులూ ఒంటెలున్న చోటుకుపోయి, వాటిపైన ఎక్కి పల్లపుప్రదేశం నుంచి పైకి వచ్చేసరికి సుమారు రెండు వందల గజాల దూరంలో నలభై యాభై మంది వీరపుర అశ్వికులు కత్తులూ, ఈటెలూ పైకెత్తి పట్టుకుని వాళ్ళకేసే వస్తున్నారు. శత్రువుల్ని ఎడాపెడా నరుకుతూ దారిచేసుకుని ముందుకు పోవటమే తప్ప, వెనుదిరిగి పల్లపుప్రదేశానికి పారిపోయే అవకాశం లేదని స్వర్ణాచారి త్రుటికాలంలో గ్రహించాడు.

ఆ వెంటనే అతడు కత్తి పైకెత్తి, "ఉష్ట్రయోధుల్లారా! నా వెంట రండి. శత్రువుల్ని కొండకోటదేవికి బలిపెడదాం! సమరబాహు మహారాజుకూ, జై!" అంటూ ఒంటెను ముందుకు దూకించాడు.

అదే సమయంలో వీరపుర అశ్వికులు, "వీరసింహ మహారాజుకూ, జై!" అంటూ తమ గుర్రాలను అదిలించి, శరవేగంతో వచ్చి సమరబాహు అనుచరుల మీదపడ్డారు.

—(ఇంకావుంది)





# అసలు కారణం

పట్టువదలని విక్రమార్కుడు చెటు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు సంపన్నుడివి గనక ధనాశతో ఇలా శ్రమపడుతూ ఉండక పోవచ్చు. కాని ధనం చాలా పాపిష్టిది. అది ఎంతటి స్నేహాన్నయినా విరోధంగా మార్చగలదు. ఇందుకు నిదర్శనంగా నీకు ఒక కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

సాకేతపురంలో గోపుడు అనే ఒక పేదవాడుండేవాడు. వాడు అడవికి పోయి కట్టెలు కొట్టి జీవించేవాడు. ఒకనాడు వాడు కట్టెలు కొట్టటానికి అడవిలో ఒక ప్రాంతానికి వెళ్ళేసరికి, సమీపంలో ఎవరో మూలుగుతున్నట్టు వినపడింది.

## బేతాళ కథలు



గోపుడు వెళ్ళి చూసేసరికి ఒక గోతిలో ఎవరో పడిపోయి ఉన్నారు. గోపుడు ఆ మని షిని పైకి తీసి చూస్తే, అతను తన పొరుగున ఉండే రామభద్రుడు అనే సంపన్నుడు!

"నన్ను దొంగలు దోచి, చావగొట్టి ఈ గోతిలో పారేశారు. రెండు రోజులుగా ఇందులో పడి చచ్చిపోతూంటే నువ్వు దేవుడిలా వచ్చి కాపాడావు," అన్నాడు రామభద్రుడు.

గోపుడు రామభద్రుణ్ణి మోసుకుని నగ రానికి తిరిగి వచ్చి, అతని ఇంట చేర్చాడు. రామభద్రుడు త్వరలోనే కోలుకుని, గోపుణ్ణి పిలిపించి, "నీ మేలు ఈ జన్మలో మరవ లేను," అంటూ కొంత డబ్బు ఇవ్వబోయాడు.

కాని గోపుడు తీసుకోక, "మనిషి మనిషికి సహాయపడటం ధర్మం. సహాయానికి ఖరీదు కట్టడం నా కిష్టం లేదు," అన్నాడు.

ఈ మాటకు రామభద్రుడు సంతో షించాడు. అది మొదలు వారిద్దరి మధ్యా మైత్రి పెరగసాగింది.

గోపుడికి అప్పుడప్పుడూ డబ్బు ఇబ్బంది కలుగుతూ ఉండేది. మరెక్కడైనా అప్పులు చేసేవాడు గాని రామభద్రుణ్ణి ఎన్నడూ అడిగేవాడు కాడు. ఈ సంగతి పసిగట్టి నప్పుడు రామభద్రుడు బాధపడేవాడు. కాని అతని ఆర్థిక చిక్కులను గురించి మాట్లాడి, తాను ధనవంతుడన్న విషయం అతనికి జ్ఞాపకం చెయ్యటానికి జంకేవాడు.

వాళ్ళు ఇలా ప్రవర్తించటం చేత వారి మధ్య స్నేహం మరింత బలపడింది. ఆ నగరంలో చాలామంది వారిని ఆదర్శ స్నేహితులుగా చెప్పుకునేవారు. వాళ్ళిద్దరూ రోజూ కలుసుకుని మాట్లాడుకోకుండా నిద్ర పోలేకపోయేవారు.

ఇలా చాలా కాలం జరిగింది.

అకస్మాత్తుగా గోపుడి భార్యకు జబ్బు చేసింది. ఆమె వ్యాధిని కుదర్చడం మామూలు వైద్యులకు సాధ్యం కాలేదు.

"ఈ వ్యాధిని ఘన వైద్యుడు దేవశర్మ కుదర్చాలి గాని, మామూలు వాళ్ళు కుదర్చ లేరు," అన్నారు అందరూ.

గోపుడి గుండెలో రాయి పడింది. అతను తన భార్య మీద ఆశ వదులుకున్నాడు. ఎందుకంటే, దేవశర్మ పాషాణానికి కూడా ప్రాణం పోయగలడు గాని, అతడి హృదయం పాషాణం. ఆయన చేత వైద్యం చేయించుకోవాలంటే వరహాల సంచులు కావాలి. గోపుడి వంటి వాళ్ళు పిలిస్తే దేవశర్మ పలకనైనా పలకడు.

ఈ పరిస్థితి గ్రహించి రామభద్రుడు తానే స్వయంగా వెళ్ళి దేవశర్మను పిలుచుకు వచ్చాడు. దేవశర్మ వచ్చి గోపుడి భార్యను పరీక్షించి, "ఈ వ్యాధి నయమవుతుంది, భయంలేదు. ముప్ఫై రోజులు మందివ్వాలి. రోజుకు యాభై వరహాలు ఖర్చవుతుంది," అన్నాడు.

"అలాగే వైద్యం చెయ్యండి," అన్నాడు రామభద్రుడు.

వైద్యం నెల రోజుల పాటు జరిగింది. గోపుడి భార్య కోలుకున్నది. వైద్యుడి కివ్వవలసిన పదిహేను వందల వరహాలూ రామభద్రుడు ఇచ్చాడు.

తన భార్య బతికి బయట పడిందని గోపుడు ఒక పక్క సంతోషించినా, మరొక పక్క స్నేహాన్ని సొమ్ము చేసుకున్నానే అని అమితంగా బాధపడ్డాడు. ఎలాగైనా ఈ బాకీ తీర్చుతానని గోపుడు అంటే రామభద్రుడూ మాట్లాడలేదు.

ఈ బాధనుంచి విముక్తి పొందటానికి గోపుడు ఎంత కష్టపడి అయినా సరే రామభద్రుడి బాకీ తీర్చాలని నిశ్చయించు





కున్నాడు. కాని గోపుడికి అది సాధ్యం అయేపని కాదని క్రమంగా తెలిసి వచ్చింది. కడుపు మాడ్చుకున్నా కూడా డబ్బుకూడ లేదు. పైపెచ్చు కట్టెలు కొట్టేపని కష్ట మయింది. పదిహేను వందలు కాదుగదా, పదిహేను వరహాలు కూడబెట్టటం కూడా అతనికి ఒకంతట సాధ్యపడేటట్టు కనిపించ లేదు. కాని అతను ప్రయత్నం మానలేదు.

డబ్బు కూడబెట్టటానికి తన భర్త పడే పాట్లు చూసి అతని భార్య, "నీ బాధ చూస్తే నాకు కడుపు తరుక్కు పోతున్నది. స్నేహితుల మని చెప్పుకుంటూ పూసుకు తిరిగారు. పదిహేను వందల వరహాలు ఆ రామభద్రుడుగారికి ఒక లెక్కలోదా? రక్తం ధారపోసినా మనం అంత సొమ్ము పుట్టించ లేమని ఆయనగారు ఎరగడా?" అంటూండేది.

ఆమె ఇదేమాట ఇరుగు పొరుగు అమ్మ లక్కలతో కూడా అంటూ వచ్చింది.

భార్య రోజూ అనే మాటలు గోపుడికి క్రమంగా నిజం అనిపించసాగాయి. తన అశక్తత తెలిసి వస్తున్న కొద్దీ అతనికి తన మిత్రుడి మీద కోపం రాసాగింది. తాను ఒకప్పుడు రామభద్రుడి ప్రాణాలు కాపాడిన వాడు. అందుకు రామభద్రుడు మాటలలో తప్ప తన కృతజ్ఞత మరే విధంగానూ చూపించి ఉండలేదు.

గోపుడు తన స్నేహితుణ్ణి కలుసుకోవటం బాగా తగ్గించాడు. రామభద్రుడు కనిపిస్తే గోపుడికి తన బాకీయే జ్ఞాపకం వస్తుంది. రామభద్రుడికి కూడా సహజంగా అలాగే ఉంటుందని గోపుడు అనుకున్నాడు.

గోపుడి భార్య ఇరుగు పొరుగుతో అన్న మాటలు రామభద్రుడి చెవినిపడ్డాయి. స్నేహాన్ని చెడగొట్టటంలో ఆనందం ఉన్న వాళ్ళు పనిపెట్టుకుని రామభద్రుడి వద్దకు వచ్చి, గోపుడి భార్య అన్న మాటలు గోపుడే అన్నట్టుగా అతనితో చెప్పారు. మంచి స్నేహం చెడిపోతున్నదే అని బాధపడిన బుద్ధిమంతులు రామభద్రుడితో, "నీ బాకీ తీర్చటానికి గోపుడు నానాగడ్డీ తింటున్నాడు.

నువు చూస్తూ ఊరుకోవడం ఎంత మాత్రమూ భావ్యంకాదు," అన్నారు.

గోపుడి మూలంగా తాను నలుగురి చేతా ఇలాటి మాటలు పడడం రామభద్రుడికి బాధ అనిపించి, గోపుడి మీద చాలా కోపం వచ్చింది. తాను తన బాకీ తీర్చమని గోపుణ్ణి ఏనాడూ వత్తిడి చెయ్యలేదు. గోపుడే తనంతట తాను బాకీ తీర్చుతానన్నాడు. అవసరం లేదు లెమ్మంటే అతను ఏం నొచ్చుకుంటాడో అని తాను ఏమీ అనక ఊరుకున్నాడు. "నేను నీ రుణం తీర్చలేను," అని గోపుడు అన్నట్టుంటే తను కాదనేవాడా? ఆ మాట అనకపోగా తన మీద దుష్ప్రచారం కూడా ప్రారంభించాడు గోపుడు.

రామభద్రుడికి గోపుడి మీద పూర్తిగా మనసు విరిగిపోయింది. ఉభయత్రా ఒకరి మీద ఒకరికి దురభిప్రాయాలు పెరిగిపోయి చివరకు ఇద్దరూ బద్ధ శత్రువులైపోయారు.

బేతాలుడు ఈ కథ చెప్పి, "రాజా, గోపుడికీ, రామభద్రుడికీ మధ్య ఉండిన గాఢ స్నేహం చెడిపోవటానికి అసలు కారణం ఏది? గోపుడి దారిద్ర్యమా, అతని భార్య అవివేకమా? రామభద్రుడి తొందరపాటా, లేక డబ్బా? దీనికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "వారి స్నేహం శత్రుత్వంగా పరిణమించటానికి ఇవేవీ కారణాలు కావు. మొదటినుంచీ వారి స్నేహం మధ్య డబ్బు అవరోధంగానే ఉంటూ వచ్చింది. డబ్బు స్నేహాన్ని ధ్వంసం చేస్తుందన్న నమ్మకం ఇద్దరిలోనూ బలంగా ఉన్నది. అందుకే వారు తమ స్నేహాన్ని డబ్బుతో ప్రమేయం లేకుండా పెంపొందించుకున్నారు. వారిది నిజమైన స్నేహమే అయితే డబ్బు ఆ స్నేహానికి ఏ రూపంలోనూ అడ్డు వచ్చేది కాదు." అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)



# నిగ్రహానుగ్రహాలు

ఒక ఊళ్ళో ఒక విద్వాంసుడు ఉండే వాడు. ఆ చుట్టుపక్కల ఎవరికి ఎలాటి శాస్త్ర సందేహం వచ్చినా ఆయన వద్దకు వచ్చి తీర్చుకు పోయేవారు.

అలాంటి ఉద్దండ శాస్త్రవేత్త పరమ దరిద్రుడు, ఒక పూటకు భోజనం ఉంటే మరో పూట ఉండేదికాదు. ఈ ఘోర పరిస్థితి గమనించి ఆ ఊళ్ళోని ప్రముఖుడు ఒకడు, ఆ విద్వాంసుడి దారిద్ర్య బాధ తొలగించాలనే ఉద్దేశంతో రాజుగారి దగ్గిర ఆ విద్వాంసుణ్ణి గురించి చెప్పి, "అలాంటి ఘన విద్వాంసుడు దారిద్ర్యంలో మునిగి తేలుతూ ఉండటం తమ పరిపాలనకే కళంకం," అన్నాడు.

రాజు ఆ ప్రముఖుడి మాటను లక్ష్యపెట్టి, తన భటుల కిచ్చి ఒక బంగారు నాణాల మూటను విద్వాంసుడి ఇంటికి పంపాడు. "మీ విద్వత్తు గురించి విని రాజుగారు మీకు ఈ కానుక పంపారు." అన్నారు భటులు.

"రాజుగారి దయకు పాత్రుణ్ణి కావటానికి నేనేమీ చెయ్యలేదే! ఈ కానుకను రాజు గారికి తిరిగి ఇచ్చెయ్యండి," అన్నాడు విద్వాంసుడు భటులతో.

తరవాత విద్వాంసుణ్ణి ఆయన భార్య తిట్టి, అది ఏం పని అని అడిగింది.

"ఎవరి మాటలో విని రాజు నాకు కానుక పంపాడు. మరో రోజు ఇంకెవరో నా పైన తప్పుడు మాటలు చెబుతారు. అప్పుడు రాజు నా తల తీయించవచ్చునా గద? రాజులు నిగ్రహానుగ్రహ సమర్థులు," అన్నాడు విద్వాంసుడు.





# మాయదారి మంత్రగాడు

ఒక గ్రామంలో ఇద్దరు అన్నదమ్ములుండే వారు. వాళ్ళు నిరుపేదలు. అన్న శరీర శ్రమ ఎంతయినా చేయగలడు గాని, ఏమంత తెలివిగలవాడు కాడు. తమ్ముడికి రాని పని అంటూ లేదు. వాడు చాలా చురుకైనవాడు.

బతుకుతెరువు కోసం వాళ్లు తమ గ్రామం విడిచిపెట్టి రాజధానికి చేరుకున్నారు. మర్నాడు రాజుగారి వద్దకు వెళ్ళి పని అడుగుతానని అన్న పెందలాడే బయలు దేరాడు.

"సాయంకాలాని కల్లా తిరిగిరా," అని తమ్ముడు అన్నను హెచ్చరించాడు.

అన్న వెళ్ళేసరికి రాజుగారు ఉద్యానంలో పచార్లు చేస్తున్నాడు. ఆయన అన్నను చూసి, "ఎవరు నువు? నీకు ఏం కావాలి?" అని అడిగాడు.

అన్న చేతులు జోడించి, "మహారాజా, నేనూ, నా తమ్ముడూ దిక్కులేని వాళ్ళం. పని కోసం ఇక్కడికి వచ్చాం. ఏమైనా పని ఇప్పిస్తే మీ పేరు చెప్పుకుని బతుకుతాం," అన్నాడు.

"నీకు పని ఇస్తాను గాని, బాధ్యతతో చెయ్యగలవా?" అని రాజు అడిగాడు.

"తప్పక చేస్తాను, మహారాజా," అన్నాడు అన్న.

రాజు అతన్ని మందిరానికి తీసుకుపోయి, ముచ్చటైన తెల్ల మేకపిల్లను చూపించి, "దీన్ని తీసుకుపోయి, అడవి అంతా తిప్పి, సూర్యాస్తమానం అయేలోపున తెచ్చి నాకు అప్పగించాలి. ఒకటి గుర్తుంచుకో; తూర్పున ఉన్న గుట్టను మాత్రం దాటవద్దు. నేను చెప్పినట్టు అక్షరాలా చెయ్యకపోతే తీవ్రంగా శిక్షిస్తాను," అన్నాడు.

అన్నిటికి తల ఆడించి, రాజుగారి మేక పిల్లను ఒక చంకనా, ఆయన ఇప్పించిన ఆహారం మూటను మరొక చంకనా పెట్టు

ఎం. కామేశ్వరరావు



కుని, అన్న అడవికి వెళ్ళాడు. అడవిలో దింపగానే మేకపిల్ల పరమానందం చెంది నట్టుగా పరుగులు తీసింది. అన్న కూడా దాని వెనకనే పరుగులు తీశాడు. ఇలా పరుగులు తీస్తూ వాళ్ళు అడవిలో చాలా దూరం వెళ్ళిపోయారు.

మధ్యాహ్నం వేళ అన్న ఆహారం తింటుంటే, వాడితోపాటు మేకపిల్ల కూడా ఆ ఆహారమే తిన్నది. తరవాత వాళ్ళు మళ్ళీ అరణ్యంలో సంచారం ప్రారంభించి, అనుకోకుండానే తూర్పున ఉన్న గుట్ట దగ్గిరికి చేరారు.

ఆ గుట్ట అంతటా పళ్ళచెట్లున్నాయి. వాటినిండా పళ్ళున్నాయి.

రాజుగారి హెచ్చరిక మరిచిపోయి అన్న జిహ్వాచాపల్యం కొద్దీ గుట్ట ఎక్కి చాలా రకాల పళ్ళు కోసుకు తిన్నాడు. వాడు తిన్న తేనెపళ్ళరసం చేతుల నిండా అంటుకుని, వాటిని కడుక్కోవలిసి వచ్చింది. సమీపంలో ఎక్కడా నీరు కనిపించలేదు.

కాని, అన్నకు గుట్ట అవతల ఒక కుటీరం కనిపించింది. అతను మేకపిల్లను ఎత్తుకుని ఆ కుటీరం కేసి పోబోతూ ఉంటే, మేక పిల్ల అరుస్తూ, గిలగిలా తన్నుకున్నది. కాని మందబుద్ధి కావటం చేత అతను దాని భావం గ్రహించక, కుటీరం వద్దకు వెళ్ళాడు.

ఆ కుటీరం ముందు ఒక భయంకరా కారుడు కూర్చుని ఉన్నాడు. వాడి నెత్తి బోడిగా ఉన్నది. కళ్ళు గాజు కళ్ళలాగా ఉన్నాయి. వాడికి జానెడు గడ్డం ఉన్నది. వాడి పక్కన పచ్చి మేకమాంసం ముక్కలూ, వాటిని గుచ్చి కాల్చటానికి ఒక ఇనప ఊచా ఉన్నాయి. వాడు కుంపటి రాజేసే ప్రయత్నంలో ఉన్నాడు.

వాడు అన్నను చూసి, "రారా, కుర్రాడా! కాస్త కుంపటి రాజేసిపో," అన్నాడు.

"నేను చీకటి పడేలోపల తిరిగి పోవాలి. నీళ్ళు దొరుకుతాయేమోనని వచ్చాను," అన్నాడు అన్న. మేకపిల్ల మాత్రం గొంతు చించుకుని అరుస్తూ, కాళ్ళు విపరీతంగా తన్నుకుంటున్నది.

ఆ భయంకరాకారుడు లేచివచ్చి, మేకపిల్ల చెవులు మెలేసి, "ఇంకా నీ పొగరు తగ్గ లేదుటే?" అని, అన్నతో, "ఈ మేకపిల్లకు చాలా పొగరు. అది నీ మాట వినదు. దాన్ని ఆ కొట్టంలో పడేసి, తలుపు మూసి, నువు కుంపటి రాజెయ్యి. నేను నీకు నీళ్ళు తెచ్చి ఇస్తాను," అని అన్నకు ఒక కొట్టం చూపించి, కుటీరంలోకి వెళ్ళిపోయాడు.

అన్న విధిలేక మేకపిల్లను కొట్టంలో మూసిపెట్టి, కుంపటి అంటించటానికి కూర్చున్నాడు. వాడికి ఆ పని చేతకాలేదు. అది అంటుకునే సరికి చీకటిపడింది. అప్పటికి వికారాకారుడు చెంబుతో నీళ్ళు తెచ్చాడు.

అన్న గబగబా తన చేతులు కడిగేసు కుని, మేకపిల్లను తీసుకుని వెళ్ళిపోదామని కొట్టం తలుపు తెరిచేసరికి, లోపల మేకపిల్ల లేదు. వికారాకారం గల ఒక ఆడమనిషి ఉన్నది. ఆ మనిషిని చూస్తూనే అన్న బెదిరిపోయి, "బాబోయ్, భూతం!" అంటూ కాలిసత్తువ కొద్దీ పరుగుతీశాడు.

వాడు పొద్దుపోయి రాజుగారిని కలుసు కుని, జరిగినదంతా చెప్పి, "అది మామూలు మేకపిల్ల కాదు, మహారాజా! భూతం!" అన్నాడు.

అంతా విని రాజు ఉగ్రుడై, "ఈ ద్రోహిని తీసుకుపోయి, చీకటికొట్లో పారెయ్యండి,"



అని భటులను ఆజ్ఞాపించాడు. వాళ్ళు ఆ ప్రకారమే అన్నను తీసుకుపోయి చీకటి కొట్టులో బంధించారు.

చీకటిపడి ఎంతో సేపైనా తన అన్న తిరిగి రాకపోయే సరికి తమ్ముడు అదుర్దా పడి రాజుగారి వద్దకు వెళ్ళాడు. ఈ మనిషి ఆ అన్నకు తమ్ముడేనని తెలిసి రాజు అతని పైన కూడా మండిపడ్డాడు.

రాజుగారి తిట్లన్నీ భరించి, తమ్ముడు రాజుగారిని జరిగినదేమిటో అడిగి తెలుసు కుని, "మహారాజా, ఇందులో నాకు స్పష్టం కాని రహస్యం ఏదో ఉన్నది. అది తమరు నాకు చెప్పినట్టయితే నేను ఆ వికారాకారుడి నుంచి మేకపిల్లను తెచ్చి, తమకు అప్ప



గించి, మా అన్నను విడిపించుకుంటాను," అన్నాడు.

వాడు మాట్లాడే తీరు చూస్తే వాడు సమర్థత గలవాడని రాజుకు అనిపించింది. ఆయన అతన్ని తన రహస్య మందిరంలోకి తీసుకుపోయి ఆ మేకపిల్ల వృత్తాంతం అంతా చెప్పాడు.

రాజుకు లేక లేక ఒక ఆడపిల్ల కలిగింది. ఆయన ఆ పిల్లను కొడుకులాగే పెంచాడు. ఆమెకు వేట అన్నా, అరణ్యం అన్నా అమితమైన ఇష్టం. రాజుతో కలిసి తరచుగా వేటకు వెళ్ళేది.

ఒకరోజు రాజూ, రాజకుమార్తే వేటాడుతూ తమ పరివారాన్ని దాటి చాలా ముందుకు వెళ్ళి, తూర్పున ఉన్న గుట్ట దాటారు. అక్కడ ఒక కుటీరం కనబడింది. అందులో నివసిస్తున్న వాళ్ళ దగ్గిర మంచినీళ్ళు దొరుకుతాయేమో నని ఆ కుటీరానికి వెళ్ళారు.

కుటీరం వెలపల ఒక వికారాకారుడు కూర్చుని, ఒక చువ్వకు మేకమాంసం ముక్కలు గుచ్చి, కాల్చుకు తింటున్నాడు. రాజకుమార్తెకు వాణ్ణీ, మేకమాంసాన్నీ చూడగానే వాంతి వచ్చినట్టయింది. ఆమెకు మేకమాంస మంటే అసహ్యం.

"ఇక్కడ మంచినీరు దొరుకుతుందా?" అని రాజు ఆ మనిషిని అడిగాడు.

ఆ మనిషి మాట్లాడకుండా తల ఎత్తి ఇద్దరినీ చూసి, లోపలికివెళ్ళి నీరు తెచ్చి, "ఈ పిల్ల నీ కూతురా? చక్కని చుక్క! నా కిచ్చెయ్యి." అని రాజుతో అన్నాడు.

రాజు చర్రున కత్తి దూశాడు.

"అసహ్యమైన మేక మాంసం తినే వికారివి! నీకు నేను కావాలా?" అన్నది రాజకుమార్తె.

ఆ మాటలకు వాడి గాజు కళ్ళు ఎర్రబడ్డాయి. వాడు మేకమాంసానికి గుచ్చే ఊచ తీసి, రాజకుమార్తెను నెత్తిమీద తాకి, "మేకమాంసం అంటే అసహ్యమైనందుకు పగలంతా మేకపిల్లగా ఉండి, నన్ను వికారి అన్నందుకు రాత్రి అంతా నాకన్న

వికారంగా ఉందు!" అన్నాడు గడ్డం దువ్వుకుంటూ.

వాడు మంత్రగాడు. రాజకుమార్తె అప్పటి కప్పుడే మేకపిల్లగా మారిపోయింది. అది మొదలు ఆమె పగలు మేకపిల్లగానూ, రాత్రి భయంకరమైన భూతకిగానూ ఉంటూ వచ్చింది. రాత్రివేళ ఆమె ఎవరికీ కనబడకుండా రాజు ఎంతో జాగ్రత్త పడ్డాడు. అప్పటికే యుక్త వయసు వచ్చిన రాజకుమార్తెకు వివాహం కావటం అసంభవం చేశాడు మాయదారి మాంత్రికుడు. వాడి శక్తులన్నీ వాడి గడ్డంలోనూ, ఇనుప ఊచలోనూ ఉన్నాయి.



తమ్ముడు ఈ కథ అంతా రాజు నుంచి విని దీర్ఘంగా ఆలోచించి, "రాజకుమార్తెకు ఈ రాత్రి ఏ ప్రమాదమూ రాదు. ఆమె మనిషి రూపంలో ఉంటుంది. తెల్లవారే లోపున ఆమెను వికారాకారున్నుంచి రక్షించకపోతే ప్రమాదం. నాకు తమరు ఇంత గుగ్గిలమూ, ఒక బలిసినమేకా ఇప్పించండి," అన్నాడు రాజుతో.

రాజు అలాగే చేశాడు. తమ్ముడు వాటిని తీసుకుని ఆ రాత్రే బయలుదేరి తూర్పు గట్టు అవతలికి వెళ్ళాడు.

మంత్రగాడు కుటీరం ముందు కూర్చుని, ఒక చేత్తో మాంసం కాల్చుతూ, రెండో చేత్తో తాగుతూ మహదానందంలో ఉన్నాడు. తమ్ముడు వాడి ముందు మేకతో సహా ఆగి, "మామా, మాంసం కంపు గొడుతున్నది," అన్నాడు.

"రారా, అల్లుడూ! ఎక్కడో మంచి మేకను సంపాదించావే?" అన్నాడు మంత్రగాడు.

"నీ కోసమే. నీకు మేకలంటే మహా రుచిగద!" అన్నాడు తమ్ముడు.

"అయితే ఆలస్యం దేనికి? కొయ్యి. ఈ మాంసం చప్పగా ఉంది. సంకరజాతి మేక కామాలు!" అన్నాడు మంత్రగాడు.

"అదే పొరపాటు. ఏ మేక మాంసమైనా రుచే. నీకు కాల్చటం చేతగాక మాడ్చేస్తున్నావు. ఇంక రుచేం ఉంటుంది? నేను

కాల్చి చూపిస్తాను, చూడు," అన్నాడు తమ్ముడు.

"అయితే నువు కాల్చి చూపించు. నేను కూచుంటా!" అంటూ మంత్రగాడు ఊచను తమ్ముడి కిచ్చి, తాను ఎడంగా కూర్చున్నాడు.

తమ్ముడు ఆ ఊచకు ఒక పచ్చిమాంసం ముక్క గుచ్చి కాల్చసాగాడు. కొద్ది సేపట్లో అది మంచి వాసన కొట్టసాగింది.

"అల్లుడా, నిజంగా వంట తెలిసిన వాడివి నువు. వాసన అలా ఉండాలి. ఆ ముక్క ఇట్లా పారెయ్యి," అన్నాడు మంత్రగాడు.

"తొందరపడకు. ఇంకా కొంచెం కాలాలి. వాసన బాగుంటే దగ్గిరికి వచ్చి వాసన చూడు," అన్నాడు తమ్ముడు.

మంత్రగాడు దగ్గిరికి వచ్చి, కుంపటి మీద ముఖం పెట్టి, కళ్ళు మూసుకుని ఆనందంతో వాసన గట్టిగా పీల్చాడు. అదే క్షణంలో తమ్ముడు నిప్పులో ఇంత గుగ్గిలం చల్లాడు. భగ్గున మంట లేచి, మంత్రగాడి గడ్డం కాస్తా కాలిపోయింది. మరుక్షణం తమ్ముడు వాడి నెత్తిన ఊచతో కొట్టి, "మేకగా మారి నీ దారిన నువు పో!" అన్నాడు.

వెంటనే మంత్రగాడు మేకపోతుగా మారి, అరుచుకుంటూ అరణ్యంలోకి వెళ్ళిపోయాడు.

మంత్రగాడి శక్తులు పోగానే రాజకుమార్తెకు మామూలు రూపం వచ్చేసింది. ఆమె అతనికి తన కృతజ్ఞత చెప్పుకున్నది.

తమ్ముడు మంత్రగాడి ఊచ కుటీరంలో పారేసి, కుటీరానికి నిప్పుపెట్టి, రాజకుమార్తెను తీసుకుని తెల్లవారే సమయానికి రాజభవనానికి తిరిగి వచ్చాడు.

ఎంతోకాలానికి తన కుమార్తెను యథా రూపంలో చూసిన రాజు ఆనందబాష్పాలు రాల్చాడు. తనను తిరిగి మామూలు మనిషిని చేసిన వాణ్ణి పెళ్ళాడతానని రాజకుమార్తె ఏనాడో నిశ్చయించుకున్నది. ఆమె కోరిక ప్రకారం రాజు ఆమెను తమ్ముడి కిచ్చి పెళ్ళి చేసి, తన అనంతరం అతనే రాజు అవుతాడని ప్రకటించాడు. అన్న తమ్ముడి వెంటనే ఉండిపోయాడు.






# మారిన దంపతులు

ఒక ఊళ్ళో రంగయ్యా, రత్తమ్మా అనే దంపతులు ఉండేవారు. వాళ్ళకు ఎంత చిన్న విషయం మీదా ఏకాభిప్రాయం ఉండేది కాదు, అస్తమానమూ పోట్లాడు కుంటూ ఉండేవారు. వాళ్ళ కీచులాటలకు కారణాలు వింటే ఊళ్ళో వాళ్ళకు ఆశ్చ ర్యంగా ఉండేది. ప్రతి స్వల్ప విషయానికీ పోట్లాడుకో వద్దని ఇరుగు పొరుగు వాళ్ళు వాళ్ళకు ఎంతో చెప్పి చూశారు, కాని లాభం లేకపోయింది.

వాళ్ళకు లేక లేక రాము డని ఒక కొడుకు పుట్టాడు. వాడంటే ఇద్దరికీ పంచ ప్రాణాలు. ఆ కారణం చేతనైనా వాళ్ళ మధ్య పోట్లాటలు తగ్గలేదు. రాముడు పెరిగి పెద్ద అవుతున్న కొద్దీ, వాడికి తన తల్లి దండ్రుల కీచులాటలు బొత్తిగా నచ్చ కుండా పోయాయి. వాళ్ళను గురించి చెప్పుకుని ఊళ్ళో వాళ్ళు నవ్వటం విని వాడు సహించలేకపోయేవాడు. వాళ్ళను ఏ విధంగా మార్చాలో వాడికి తెలియలేదు.

పన్నెండేళ్ళ వయసులో వాడికి ఇదొక తీరని విచారంగా తయారయింది. వాడు పశువులను మేతకు తోలుకుపోయి, అక్కడ కూడా ఈ విషయమే ఆలోచిస్తూ విచారంగా కూర్చుని ఉన్నాడు.

ఆ సమయంలో వాళ్ళ ఊరి భూత వైద్యుడు అటుగా వచ్చి, "ఏంరా, బాబూ, విచారంగా ఉన్నావు?" అని అడిగాడు.

రాముడు తన తల్లిదండ్రుల పోట్లాటలను గురించి ఆ భూత వైద్యుడికి చెప్పి, "బాబూ, వాళ్ళు అలా కొట్లాడుకుంటు న్నంత కాలమూ నాకు ఈ విచారం ఉండేదే," అన్నాడు.

"నాయనా, దిగులుపడకు. నీ తల్లి దండ్రులను మారిస్తే నువే మార్చాలి. దానికి ఒక ఉపాయం చెబుతాను. నేను

సి హెచ్. వెంకటవిజయకుమార్



చెప్పినట్టు చెయ్యి," అంటూ భూతవైద్యుడు రాముడికి ఏదో చెప్పి, ఇంటికి వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రం పశువులను తోలుకుని ఇంటకి వస్తూనే రాముడు తల్లితో, "అమ్మా, నా చొక్కా ఉతికి ఆరెయ్యమని పొద్దున చెప్పానా లేదా? నీకు ఇంత మతిమరుపేం? నీకో కొడుకు ఉన్న సంగతి కూడా జ్ఞాపకం ఉంటున్నట్టు లేదే?" అంటూ ఇంతెత్తున ఎగిరిపడ్డాడు.

వాడి ప్రవర్తన చూసి రత్తమ్మ నిర్ఘాంత పోయింది. ఎన్నడూ తనను పల్లెత్తు మాట అనని కొడుకు ఏదో పూనినట్టుగా ఎందు కిలా ఎగిరి పడుతున్నాడో ఆమెకు అర్థం కాలేదు. పైగా వాడన్న మాట అబద్ధం! వాడు తనను చొక్కా ఉతకమనలేదు. వాడిలో ఈ మార్పుకు కారణం మరేదో అయి ఉంటుందనుకుని ఆమె సరుకులు తీసుకురావటానికి అంగడికి వెళ్ళింది.

కొంతసేపటికి రంగయ్య పొలం నుంచి తిరిగివచ్చి, మూతి ముడుచుకు కూర్చున్న కొడుకును చూసి, "ఏంరా? ఏమిటి అలా ఉన్నావు? ఒంట్లో బాగాలేదా?" అని అడిగాడు.

"బాగాలేకేం? నలుగురి మధ్యా తలెత్తుకు తిరగటమంటే కష్టంగా ఉంది!" అన్నాడు రాముడు.

"నీ కొచ్చిన తలవంపులేమిటి?" అని తండ్రి మళ్ళీ అడిగాడు.

"మంచి బట్టలు లేవు. ఎండలోనూ, వానలోనూ ఉత్త కాళ్ళతోనే తిరగాలి. చెప్పులు లేవు. ఒక్కగానొక్క కొడుకును ఇలాగేనా చూసేది?" అని రాముడు విసుక్కున్నాడు.

ఈ మాటలు విని రంగయ్య వెలవెల పోయాడు. రాముడు నోరు తెరిచి ఎన్నడూ ఏదీ అడిగి ఎరగడు. తండ్రితో ఎన్నడూ ఇలా నిష్ఠురంగా మాట్లాడి కూడా ఎరగడు.

ఇంతలో సరుకులు కొని రత్తమ్మ ఇల్లు చేరింది. తండ్రి కొడుకుల సంభాషణ ఆమె విన్నది. తండ్రితో కూడా వాడు మామూలుగా లేదు. ఆ రాత్రి భోజనాల దగ్గిర కూడా

రాముడు తల్లిదండ్రు లిద్దరినీ తెగ విసికించాడు. వాడు భూతవైద్యుడి సలహా అమలు చేస్తున్నాడు. వారం రోజులు గడిచాయి. రాముడు మామూలు మనిషి కాలేదు.

రత్తమ్మ తన భర్తతో, "వీడికి ఏదో గాలి తగిలినట్టుంది. మంత్రం వేయింతాం," అన్నది.

"మంత్రం వెయ్యటం ఏమిటి? మందిప్పించాలి," అన్నాడు రంగయ్య.

"ఈ జబ్బుకు మందెవడిస్తాడు? భూతవైద్యుడైతే మంత్రం వేసి క్షణంలో దయ్యాన్ని వదిలిస్తాడు," అన్నది రత్తమ్మ.

"వైద్యుడైతేగాని ఈ రోగం కనిపెట్ట లేడు," అన్నాడు రంగయ్య.

ఇద్దరూ చచ్చేట్టు పోట్లాడుకున్నారు. వాళ్ళను చాలాసేపు పోట్లాడుకోనిచ్చి రాముడు, "నేను ఫలానా భూతవైద్యుడి దగ్గిరికైతే వస్తాను," అన్నాడు.

ఎవరి దగ్గిరికీ రాను అనకుండా వాడు భూతవైద్యుడి దగ్గిరికి వస్తానన్నందుకు తల్లిదండ్రులు సంతోషించి, వాణ్ణి తీసుకుని భూతవైద్యుడి దగ్గిరికి వెళ్ళారు.

వాళ్ళు చెప్పినదంతా విని భూతవైద్యుడు, "మీ కుర్రవాణ్ణి నయం చెయ్యటం పెద్ద పని ఏమీ కాదు. కాని నేను మిమ్మల్నిద్దరినీ విడివిడిగా ఒక ప్రశ్న అడుగుతాను. ఆ ప్రశ్నకు మీరు సరి అయిన సమాధానం



చెప్పిన తరవాత మీ వాడికి పట్టిన దయ్యాన్ని క్షణంలో వదలగొట్టుతాను," అన్నాడు.

ఆయన ముందు రంగయ్యను పిలిచి, "రాముడు నీ కొడుకే గదా?" అని అడిగాడు.

ఈ ప్రశ్నకు రంగయ్య ఆశ్చర్యపడి, "చిత్తం," అన్నాడు.

తరవాత ఆయన రంగయ్యను అవతలికి పంపి, రత్తమ్మను పిలిచి, "రాముడు నీ కొడుకే గదా?" అని అడిగాడు. ఆమె కూడా రంగయ్య చెప్పినట్టే, "చిత్తం!" అన్నది.

తరవాత ఆయన ఇద్దరినీ పిలిచి, "మీరిద్దరూ సరి అయిన సమాధానం చెప్పలేదు.

ఒక వారం గడిచాక సరి అయిన సమా ధానం ఆలోచించుకు రండి," అన్నాడు.

వారం గడిచింది. దంపతు లిద్దరూ భూతవైద్యుడి దగ్గిరికి వచ్చారు. ఆయన వారిని విడి విడిగా మళ్ళీ అదే ప్రశ్నవేశాడు.

ఈ సారి రంగయ్య, తెలివిగా చెబు తున్నాననుకుని, "వాడు నా భార్య కొడు కండి," అన్నాడు.

రత్తమ్మ మాత్రం, "వాడు నా కొడుకే నండి," అన్నది.

ఈ సారి కూడా భూతవైద్యుడు చిరునవ్వు నవ్వి, "మీరిద్దరూ సరి అయిన సమా ధానం చెప్పలేదు. మరింత బాగా ఆలో చించుకుని, వారం దాటినాక మళ్ళీ రండి," అన్నాడు.

రాముడి పిచ్చి నా నాటికీ ముదురు తున్నది. ఈ సారి రంగయ్యా, రత్తమ్మా భూతవైద్యుడికి ఏం చెప్పాలో కూడ బలుక్కుని ఒక నిర్ణయానికి వచ్చారు.

వారం గడవగానే వాళ్ళిద్దరూ భూత వైద్యుడి వద్దకు వెళ్ళి, "మేం ఇద్దరం బాగా సంప్రతించుకుని వచ్చాం. రాముడు మా ఇద్దరి బిడ్డ," అని ఆయన ప్రశ్నకు విడి విడిగా సమాధానం చెప్పారు.

భూతవైద్యుడు మనస్ఫూర్తిగా నవ్వి, "ఈ సారి మీరు సరి అయిన సమాధానం చెప్పారు. ఇన్నాళ్ళకు మీ దయ్యం వది లింది. మీ రిద్దరూ కూడ బలుక్కున్నారు. భార్యాభర్తలు ఒకరితో ఒకరు సంప్ర తించుకో కుండా ఒకరు కోటికీ, ఒకరు ఏటికీ లాగుతూంటే జీవితమంతా పోట్లాటే! రాముడికి ఏమీ లేదు. నా సలహా మీదనే వాడు నాటకం ఆడాడు. ఒకరి సంగతి ఒకరు ఆలోచిస్తూ సుఖంగా ఉండండి. రాముడు రత్నంలాటి వాడు. మీరు మీ తగా దాలతో వాడికి సుఖం లేకుండా చేశారు." అని మందలించాడు.

రంగయ్యా, రత్తమ్మా ఈ దెబ్బతో గుణ పాఠం నేర్చుకుని కొట్లాటలు మాని, ఒకరి నొకరు సంప్రతించుకుంటూ సుఖంగా బతకటం నేర్చుకున్నారు. రాముడి ప్రాణం సుఖానపడింది.





హీరాగఢ్ దేశంలో హరవర్మ అనే వర్తకుడు ఉండే వాడు. ఆయన నిజాయితీపరుడూ, ధర్మాత్ముడూనూ. అధిక లాభాలు కోరకుండా ఆయన వీలయినంత కొద్ది లాభానికి సరుకులు అమ్మేవాడు. ఆయనకు కల్తీలూ, దొంగ నిలవలూ అంటే ఎంత మాత్రమూ సహించేది కాదు. ఇలాటి దుర్మార్గాలకు ఒడిగట్టకుండానే ఆయన అంతులేని ధనం సంపాదించాడు. ప్రజలకు ఆయన సరకుల మీదా, ఆయన మీదా అపారమైన నమ్మకం ఉండటం చేత, ఆయన దుకాణాల వద్ద ఎప్పుడూ గుంపులుండేవి.

వార్ధక్యంలో హరవర్మ చనిపోగా, ఆయన ఏక పుత్రుడు శంకావర్మ ఆయన ఆస్తికీ, వర్తకానికీ వారసుడయాడు. శంకావర్మ తండ్రికి పూర్తిగా విరుద్ధం. అతను స్వార్థపరుడూ, దురాశాపరుడూ, ద్రోహబుద్ధి కలవాడూనూ. అయితే అతను జిత్తులమారివాడు కావటం చేత అందరితోనూ ఎంతో మర్యాదగానూ, బోళాగానూ ప్రవర్తించుతూ, లోలోపల కుతంత్రాలు ఆలోచించేవాడు. అతని భార్య రంగీలా, పొరుగు రాజ్యానికి చెందిన ఒక జిత్తులమారి వర్తకుడి కుమార్తె. ఆమె స్వభావం కూడా కుటిలమైనదే. ఆమె శంకావర్మకు ప్రోత్సాహం ఇచ్చింది.

హీరాగఢ్ దేశం సుభిక్షమైనది. అక్కడ పంటలు చక్కగా పండేవి. ఏ లోటూ ఎరగకుండా ప్రజలు సుఖంగా జీవించేవారు.

ఈ యేడు పంట పైరు మీద ఉండగానే ఎవరెవరో మనుషులు వచ్చి, ధాన్యాన్ని హెచ్చు ధరలకు కొనేశారు. నూర్పిళ్ళ సమయంలోనే మంచి గిరాకీ తగిలినందుకు రైతులు పరమానందం చెంది, దిగిన పంటలో చాలా భాగం హెచ్చు ధరలకు

పి. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



అమ్మేశారు. ధాన్యం కొనుక్కున్నవాళ్ళు ఎలా వచ్చారో, అలాగే మాయమయారు.

కొద్ది మాసాలు గడిచేసరికి దుకాణాలలో ధాన్యం కనబడకుండా పోయింది. తిండి గింజలకు కరువు ఏర్పడటం చూసి రాజు రాచగాదెల నుంచి ధాన్యం తీయించాడు. కాని ఆకలితో అలమటించే అసంఖ్యాక ప్రజలకు ఆ ధాన్యం ఏ మాత్రం చాలలేదు.

కరువు భయంకర రూపం దాల్చింది. దేశమంతటా ఆకలి చావులు ఆరంభమయాయి. రాజు నిస్సహాయుడయాడు. ఆయన కన్నీరు కార్చాడు. అంతకన్న ఆయన ప్రజలకు చేయగలిగినది ఏమీ కనిపించలేదు.

ఈ స్థితిలో శంకావర్మ ఒకనాడు రాజును చూడవచ్చి, "మహారాజా, నేను తమకు ఏవిధంగా తోడ్పడగలను?" అని అడిగాడు.

"మన ప్రజలకు ఎంతగానైనా తోడ్పడవచ్చును. మళ్ళీ పంటలు వచ్చేదాకా ఈ కరువు సమస్య తీరేమార్గం ఉంటే నాకు చెప్పు," అన్నాడు రాజు.

"తమ దాసానుదాసుణ్ణి! ఆలోచించటానికి నాకు రెండు రోజులు వ్యవధి ఇయ్యండి," అన్నాడు శంకావర్మ.

మూడో నాడు అతను మళ్ళీ రాజుగారి దర్శనం చేసుకుని, "మహారాజా, మన పొరుగు దేశమైన శక్తిగఢ్ నుంచి మనం బియ్యం తెచ్చుకోవచ్చు. మనకూ వారికీ సరిహద్దు తగాదాల మూలంగా మైత్రి లేనప్పటికీ, తమరు అర్థిస్తే శక్తిగఢ్ రాజు మనకు సహాయపడవచ్చు," అన్నాడు.

"అసంభవం! ఇది మన పరువుకు సంబంధించిన విషయం. నేను శత్రువును యాచించను," అన్నాడు రాజు.

శంకావర్మ ఒక్కక్షణం ఆలోచించి, పశ్చాత్తాపంతో, "మీరు చెప్పినది నిజం, మహారాజా. నేను మూర్ఖుణ్ణి. ప్రాణాలకన్న పరువు ముఖ్యమన్నది మరచి అలా మాట్లాడాను. దయచేసి నన్ను క్షమించండి. నేను మరొక సూచన చేస్తాను. అది తప్పక తమకు ఆమోదకరం అవుతుందను

కుంటాను. అందువల్ల మన శత్రువుకు నష్టం కలిగించిన వారం కూడా అవుతాం," అన్నాడు.

"దానికి అభ్యంతరం ఎందుకు ఉంటుంది?" అన్నాడు రాజు.

"అలా అయితే, ఒక్క రాయితో రెండు పిట్టలను కొట్టవచ్చు. నేను శక్తిగఢ్‌లో ఉండే మా మామగారి సహకారంతో, మన ప్రజలకు మూడు, నాలుగు మాసాలు సరిపడే ఆహార ధాన్యాలను రహస్యంగా రవాణా చేయిస్తాను. అందు వల్ల అయే అదనపు ఖర్చుకు తమరు అభ్యంతరం చెప్పరను కుంటాను," అన్నాడు శంకావర్మ.

"దొంగ రవాణా చాలా నిరసించదగినదే, కాని మన ప్రజలకు తిండి ఎంతైనా అవసరం గనకనూ, శత్రువుకు నష్టం కలిగించిన వాళ్ళం అవుతాం గనకనూ, నేను నీ సూచనకు సమ్మతిస్తున్నాను. అన్నట్టు, అలా తెచ్చుకునే ధాన్యం ధర ఉజ్జాయింపుగా ఏ మాత్రం ఉంటుందో లెక్కకట్టి చెప్పగలవా?" అని రాజు శంకావర్మను అడిగాడు.

"మామూలు ధరకు కనీసం నాలుగింతలు ఉంటుంది, మహారాజా!" అన్నాడు శంకావర్మ.

"అది చాలా హెచ్చుధర అవుతుంది గదా?" అన్నాడు రాజు.



"దొంగరవాణా సరుకు ధర ఎప్పుడూ ఎక్కువే, మహారాజా," అన్నాడు శంకావర్మ ఇకిలిస్తూ.

శంకావర్మ ఉండే ఇల్లు, అతని తండ్రి ఊరి చివర కట్టించిన మహాభవనం. దాని చుట్టూ విశాలమైన ఆవరణా, అందులో ఒక కోనేరూ, తోటా, ఒక దేవాలయమూ ఉన్నాయి. దేవాలయం మటుకు ప్రహరీ గోడ వెలపల ఉన్నది. దేవాలయం సమీపంలో నేరేడు, మామిడి చెట్లుగల చిన్న తోపు ఉన్నది.

శంకావర్మ మొదటిసారి రాజదర్శనం చేసుకున్న రోజున దేవాలయం ప్రాంగణంలో ఒక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. ఈ వ్యక్తి



పేరు సత్యకాముడు. ఇతను గ్రామీణుడు, చాలా తెలివీ, వివేకమూగలవాడు. ఇతని భార్యా, పిల్లలూ కరువు వాతపడి, ఆకలి చావులు చచ్చారు. ఉన్న వారంతాపోయి అతను ఇల్లు వదిలి గాలిగా తిరుగుతూ, యాదృచ్ఛికంగా ఆ రోజు దేవాలయ ప్రాంగణానికి వచ్చాడు.

సత్యకాముడు ఒక చెట్టుకు చేరబడి తన దుస్థితిని గురించి ఆలోచించుకుంటూ ఉండగా అతనికి ఆలయం చుట్టూ ఉన్న చప్టామూల నుంచి చీమలు బారుగా వస్తూ ఉండటం కనబడింది. ప్రతి చీమ ముక్కునా ఒక బియ్యపుగింజ ఉన్నది. ఇది చూడగానే అతని బుర్ర చురుకుగా పని చెయ్యసాగింది. ఆ ఆలయం దేశంలోని ప్రసిద్ధ వర్తక శ్రేష్ఠుడి దని అతనికి తెలుసును. అతను ఒక వెదురుకర్ర తీసుకుని, కుంటివాడిలాగా కుంటుతూ నడుస్తూ, కర్రను చప్టా మీద తాటించసాగాడు. కర్ర చేసే ధ్వనిని బట్టి చప్టా దిగువున మాళిగ ఉన్నట్టు అతనికి తెలిసిపోయింది.

"రహస్య మాళిగలో బియ్యం ఉన్నది! ప్రజలేమో తిండికి లేక మలమల మాడి పోతున్నారు. ఈ రహస్యం బయట పెట్టాలి," అనుకున్నాడు సత్యకాముడు.

అతను ప్రధాన మంత్రిని చూడబోయి, "అయ్యా, శంకావర్మ తాలూకు ఆలయం అడుగున రహస్య మాళిగలో చాలా ధాన్యం ఉన్నది," అన్నాడు.

"నీ కేమన్నా మతిపోయిందా? శంకావర్మ చాలా పెద్దమనిషి, ధర్మాత్ముడు. అతన్ని గురించి కలలో కూడా అపోహపడరాదు. మరెన్నడూ ఇలా అనకు. పదపద," అన్నాడు ప్రధానమంత్రి.

సత్యకాముడు కొత్వాలు వద్దకు వెళ్ళి చెప్పి చూశాడు. అక్కడ కూడా అతని ప్రయత్నం నెరవేరలేదు. సత్యకాముడు, బాధితులైన ప్రజల వద్దకే పోవనిశ్చయించాడు.

రెండు రోజులు గడిచాయి. మూడోరోజు సాయంకాలం అతను ఒక మర్రిచెట్టు

కిందికి చేరాడు. దిక్కూ మొక్కూలేని వాళ్ళు అనేకమంది అక్కడ చేరారు. అందరూ ప్రాణంతో ఉన్న అస్థిపంజరాల లాగా ఉన్నారు. ఈ బతికి ఉన్న శవాల లాటి వాళ్ళు శంకావర్మను గురించి గొప్పగా మాట్లాడుకుంటూ ఉండటం విని సత్యకాముడు ఒకడి పక్కన చేరి, "ఎవరీ శంకావర్మ అనే ఆయన? ఎలాటివాడు?" అని అడిగాడు.

"ఓ, దేవుడిలాటివాడు. ఎంత దయగలవాడు! ఎంత దాత! అందరికీ ధర్మం చేస్తాడు," అన్నాడు ఆ మనిషి.

"అన్నదానం చేస్తాడా?" అని సత్యకాముడు అడిగాడు.

"లేదు. డబ్బిస్తాడు," అన్నాడు ఆ మనిషి.

"డబ్బు దేనికి, తగలెయ్యనా? అంగడిలో తిండి ఉంటే గద? డబ్బుతో లాభం లేదు. అందుకే మనం ఆకులూ, అలములూ, దుంపలూ, వేళ్ళూ తిని కొంచెం కొంచెమే చస్తున్నాం. మనం బతకటానికి ఏమన్నా చేస్తున్నాడా?" అని సత్యకాముడు అడిగాడు.

ఈ లోపల ఈ సంభాషణ వినటానికి మిగిలిన వాళ్ళంతా చుట్టూచేరారు. సత్యకాముడి ప్రశ్నకు వాళ్ళంతా తలా ఒక విధంగానూ సమాధానం చెప్పారు:




"ఆయనే కాదు, ఎవరు మాత్రం ఏం చెయ్యగలరు? ఆయన చేసేది వర్తకం. తిండి గింజలంటూ ఉంటే వాటిని అమ్మగలడు. అంతే! మనని రాజుగారే రక్షించలేనప్పుడు ఒక వర్తకుడు మనని రక్షించగలడా? దేవుడికి మనమీద దయ తప్పింది. మనం చావాలని రాసిపెట్టి ఉన్నది."

వారందరికీ శంకావర్మ మీద చాలా మంచి అభిప్రాయం దృఢంగా ఉన్నదని గ్రహించి, దాన్ని మార్చటానికి ఏదైనా అద్భుత ప్రయోగం చెయ్యదలిచి సత్యకాముడు వాళ్ళతో ఇలా అన్నాడు:

"మిత్రులారా, నిజం ఏమిటో నాకు తెలీదు. కాని ఇవాళ సాయంకాలం ఒక



చిత్రం జరిగింది. నేను మగత నిద్రలో వుండగా ఎవరో నా చెవిలో రహస్యంగా, 'నాయనా, ఈ కరువు మనిషి తెచ్చి పెట్టినది. ఒక దుర్మార్గుడు ధాన్యాన్ని దొంగ నిలవ చేసి, కరువు తెప్పించాడు. ఆ దుర్మార్గుణ్ణి పట్టుకునే శక్తి నీ కిస్తాను. నీ కొక ఈల ఇస్తున్నాను. దీని సహాయంతో నువు కరువుకు కారణం అయిన దుర్మార్గులను పట్టుకోగలుగుతావు.' అని చెప్పారు. వెంటనే మేలుకుని చూసేసరికి నా కాళ్ళ దగ్గిర ఈల ఉన్నది."

"ఏదీ ఈల? ఏదీ?" అని మర్రిచెట్టు కింద కూర్చునివున్న అందరూ ఒక్కసారే అడిగారు.

సత్యకాముడు తన జేబులో నుంచి ఒక ఈల తీసి వాళ్ళకు చూపాడు. వాళ్ళు దాన్ని ఆసక్తితో పరీక్షించారు.

"ఈ ఈల ధాన్యం దాచిన వాణ్ణి ఎలా పట్టిస్తుందబ్బా?" అన్నాడు ఒకడు.

"రేపు ఉదయం మీరే చూస్తారుగా? కాని ముందు మీరు ఆ కనబడే పొలం దగ్గిరికి వీలయినంత మందిని చేర్చండి," అన్నాడు సత్యకాముడు.

ఈ సత్యకాముడి వృత్తి బొమ్మలు చెయ్యటం. అతను ఆడ, మగ దేవతల బొమ్మలను చాలా అందంగా తయారు చేసేవాడు. ఇంద్రజాలం అతనికి ప్రధానమైన సరదా. ఆరేళ్ళ వయసులో కరువు వాత పడి చనిపోయిన అతని ఏక పుత్రిక సీమంతి తన తండ్రి చేసే ఇంద్రజాలం కోసం చాలా సరదా పడేది. అది ఊదకుండా మోగే ఈల. తన వారందరూ పోయాక సత్యకాముడు అన్నీ విసర్జించాడు గాని, తన కూతురికి ప్రియమైన ఈ ఈలను మాత్రం వదలలేక, దాన్ని ఒక సంచీలో దాచి పెట్టుకున్నాడు.

ఈ ఈలలో ప్రత్యేకత ఏమంటే ఒక రబ్బరు గొట్టానికి ఒక చివర రబ్బరు తిత్తి ఉంటుంది; దాని రెండో చివర ఈలకు అమర్చి ఉంటుంది. అందుచేత రబ్బరు తిత్తిని నొక్కినప్పుడు తిత్తిలో ఉండే గాలి

ఈల కుండా పోయి, అది మోగుతుంది. ఈ రబ్బరు తిత్తి తన కుడి చంకలో అమరే టట్టూ, ఈల తన ఎడమచేతి చొక్కా చాటున ఉండేటట్టూ సత్యకాముడు తగి లించుకున్నాడు. అతను అలాటిదే మరొక ఈల దగ్గిర పెట్టుకున్నాడు. ఈ రెండో ఈలను ఒక కర్ర చివర దారంతో వేళ్ళాడ గట్టి ఎడమ చేత్తో పట్టుకుని, చంకలో ఉన్న తిత్తి నొక్కితే, కర్రకు కట్టిన ఈల ఊద కుండానే మోగినట్టు భ్రమ కలుగుతుంది. తిత్తిని ఎన్నిసార్లు నొక్కాలంటే అన్నిసార్లు నొక్కటం అతనికి తెలుసు. ఆ రాత్రే అతను ఏర్పాట్లన్నీ చేసుకున్నాడు.

మర్నాడు తెల్లవారే సరికి, మర్రిచెట్టుకు ఎదురుకుండా ఉన్న పొలంలో వందలకొద్దీ జీవచ్ఛవాలు పోగయారు. సత్యకాముడు తన రెండో ఈలను అందరికీ పరీక్షించమని ఇచ్చి, తరవాత దాన్ని దారంతో కర్ర చివర వేళ్ళాడగట్టి, ఆ కర్రను ఎడమ చేత్తో పట్టుకుని ఇలా అన్నాడు:

"మిత్రులారా, నాకు వచ్చిన కల గురించి మీరంతా వినే ఉంటారు. ఆహార ధాన్యాల దొంగ నిలవలు ఎక్కడన్నా ఉంటే ఈ ఈల చెబుతుంది. ఈల ఒక్క సారి మోగితే అవునన్న మాట, రెండు సార్లు మోగితే కాదన్న మాట. దీన్ని ఇప్పుడు పరీక్షింతాం. సరేనా?"



"సరే, సరే!" అని అందరూ ఉత్సా హంగా అరిచారు.

"ఈ ప్రాంతాల ఉన్న గొప్ప వర్తకుడితో ప్రారంభింతాం. అతని పేరు ఏమి టన్నారూ?" అన్నాడు సత్యకాముడు.

"శంకావర్మ." అన్నారు జనం.

సత్యకాముడు ఈలను సంబోధిస్తూ, "ఈలా, ధాన్యం దాచిన వాడు శంకావర్మా? దయచేసి చెప్పు." అన్నాడు.

ఈల ఒక్కసారి మోగింది. అందరూ అద్భుత పడ్డారు.

"నువు చెప్పేది శంకావర్మ తిండి దొంగ అనేనా? మళ్ళీ చెప్పు." అన్నాడు సత్యకాముడు.

మళ్ళీ ఈల ఒక్కసారి మోగింది. జనం మరింతగా ఆశ్చర్యపోయారు.

"అతను ధాన్యాన్ని కొట్లలోనూ, గోదాముల్లోనూ దాచాడా?" అని సత్యకాముడు ఈలను మళ్ళీ అడిగాడు.

ఈల రెండు సార్లు మోగింది.

"కాదంటున్నది ఈల," అన్నాడు సత్యకాముడు.

"మరెక్కడ దాచాడు?" అని ఎవరో అడిగారు.

"దేవాలయం కింద ఉన్న రహస్య మాళిగలో అయి ఉండాలి. అవునా?" అని సత్యకాముడు ఈలను అడిగాడు.

ఈల ఒక్కసారి మోగింది.

"రహస్యమాళిగలో ఉన్న ధాన్యాన్ని మేము బయటికి తీయమా?" అని సత్యకాముడు ఈలను అడిగాడు.

ఈల ఒక్కసారి మోగింది. జనం రెచ్చిపోయారు.

"పదండి దేవాలయానికి!" అని అందరూ కేకలు పెట్టారు.

దేవాలయం వెనక భాగంలో ఒక రహస్య ద్వారం కనబడింది. అక్కడి నుంచి కిందికి మెట్లు ఉన్నాయి. సత్యకాముడు తన అనుచరులతో దిగువకు వెళ్ళేసరికి, కింది మాళిగ వేలకొద్దీ బియ్యపు బస్తాలతో కిక్కిరిసి వున్నది.

త్వరలోనే ఈ వార్త రాజుకు చేరింది. ఆయన పరివారంతో సహా వచ్చాడు. శంకావర్మను పట్టుకుని బంధించారు. అతను తన మామ సహాయంతో తరుణంలో ధాన్యం కొనేసి, కృత్రిమంగా కరువు సృష్టించాడని విచారణలో రుజువయింది. ఆ ధాన్యాన్నే నాలుగు రెట్లు ధరకు అమ్మి డబ్బు చేసుకోవాలని అతను అనుకున్నాడు. శంకావర్మ ద్రోహి అని తీర్పు చెప్పి, రాజు అతనికి మరణదండన విధించాడు.

సత్యకాముడి చాతుర్యాన్ని మెచ్చుకుని రాజు అతన్ని తన సలహా దారుగా నియమించాడు. సత్యకాముడి తెలివితేటలతో దేశానికి కరువు పీడా, ఆకలిచావులూ తప్పిపోయాయి.



# గాడిద నీడ

అరేబియాలో ఇబ్రహీం అనే పేదవాడు తన గాడిదను అద్దెకిచ్చి ఆ ఆదాయంతో జీవించే వాడు. ఒక రోజు ఒక దూరదేశపు ప్రయాణీకుడు ఆ గాడిదను తన ప్రయాణానికి అద్దెకు తీసుకున్నాడు. ప్రయాణీకుడు గాడిద మీదా, ఇబ్రహీం గాడిద వెనకా బయలుదేరారు.

సూర్యుడు నడినెత్తికి వచ్చి, ఎండ తీవ్రంగా ఉన్న సమయంలో వాళ్ళు ప్రయాణం నిలిపి, ఒక చోట విశ్రమించారు. గాడిద నీడలో ప్రయాణీకుడు పడుకున్నాడు. ఇబ్రహీం మాత్రం ఎండలోనే ఉండిపోయాడు. ఎందుకంటే గాడిద నీడ ఇద్దరికి చాలదు.

అయితే, గాడిదను అద్దెకు తీసుకున్న ప్రయాణీకుడు దానినీడలో పడుకుని త్వరలోనే నిద్రపోయాడు. అప్పుడు ఇబ్రహీం తన గాడిదను కొంచెం అవతలికి తీసుకుపోయి, దాని నీడలో ఈ సారి తానే పడుకుని, త్వరలోనే నిద్రపోయాడు.

ఎండవేడికి ప్రయాణీకుడు లేచిచూస్తే గాడిద దూరంగా వున్నది, దాని నీడన దాని సొంతదారు నిద్రపోతున్నాడు. ప్రయాణీకుడు ఆగ్రహించి, ఇబ్రహీంను లేపి, అతనితో తగాదా పెట్టుకున్నాడు.

"నేను నా గాడిదను అద్దెకిచ్చాను గాని, దాని నీడను ఇవ్వలేదు," అన్నాడు ఇబ్రహీం.

ఇద్దరూ తగాదాపడి, ముష్టియుద్ధం దాకా వచ్చారు. వాళ్ళ తగువు తేలేలోపునే గాడిద తన మీది బరువులను కింద పడేసి ఎటో వెళ్ళిపోయింది.

—చిట్టా రాజేశ్వరశాస్త్రి





# అహంకారం

కొత్తకోట అనే గ్రామంలో శివజ్ఞానపండితుడు అనే ఆయన ఉండేవాడు. ఆయన గొప్ప పండితుడూ, మహాజ్ఞానీ కూడానూ. ఆయనను అందరూ ఎంతో గౌరవించేవారు. ఆయన ఇంట తరచుగా పండిత చర్చలు జరుగుతూ ఉండేవి.

ఆయనకు పార్వతి అనే కుమార్తె ఉండేది. ఆమె కూడా మంచి విద్వాంసురాలు, ఏ విషయం చెవిన పడినా వెంటనే గ్రహించేది. తండ్రి తన శిష్యులకు చెప్పే పాఠాలన్నీ శిష్యులు గ్రహించక ముందే పార్వతి గ్రహించేది. తమ ఇంట్లో జరిగే పండిత చర్చలలో ఆమెకు అర్థం కానిదేమీ ఉండేది కాదు.

అన్నీ తెలిసిన శివజ్ఞానపండితు డంతటివాడే తనకు తెలిసినది ఆవగింజంలో అర భాగం కూడా లేదు అనుకునేవాడు, కాని పార్వతి మటుకు తనకు తెలియనిది ఏమీ లేదని గర్వపడేది. తనకన్న మూడింతలు వయసు గలవాళ్ళయినా సరే, ఏ సమస్య గురించి గాని చర్చించుకుంటూ ఉంటే పార్వతి తాను కలగజేసుకుని, వారి అనుమానాలకు సమాధానాలు చెప్పేసేది. రాను రాను ఆమె పండిత గోష్ఠిలో కూడా తలదూర్చి, ఎవరైనా తప్పు చెబితే వారిని సరిదిద్దటమేగాక చులకన చేసి మాట్లాడే దశకు వచ్చింది.

పార్వతికి ఈ అహంకారం చిన్నతనం నుంచీ ఉన్నదే అయినప్పటికీ, చిన్నపిల్ల తన ఈడుకు మించిన తెలివితేటలు చూపుతూంటే తండ్రికీ, మిగిలిన వాళ్ళకూ కూడా ముచ్చటగానే ఉండేది. పెద్దదైతే ఆమెకు వివేకం వచ్చి, అలా ప్రతి విషయంలోకీ జొరబడటం తానే మానేస్తుందని తండ్రి అనుకున్నాడు. కాని ఆమె అహంకారం వయసుతో ముదురుతున్నది.

ఆర్. సుందరాచారి

"నువు పెద్ద వాళ్ళ సంభాషణల్లోకి పిలవని పేరంటంగా జొరబడరాదు, తల్లీ," అని శివజ్ఞానపండితుడు పార్వతికి, చెప్పి చూశాడు.

"పాండిత్యానికీ, జ్ఞానానికీ వయసుతో ఏం సంబంధం, నాన్నా? ఎన్ని ఏళ్ళు వచ్చినా శుంఠ శుంఠే," అనేది పార్వతి. తన తెలివి తేటలు అందరికీ తెలియటం తండ్రికి ఇష్టం లేదేమోనని కూడా ఆమె అనుమానించేది.

పార్వతికి పదిహేనో ఏడు కూడా వచ్చింది. అయినా ఆమె అహంకారం ఏ మాత్రమూ తగ్గలేదు. శివజ్ఞానపండితుడు అన్నీ తెలిసిన వాడై ఉండి కూడా, తన కుమార్తెను మార్చడం ఎలాగో తెలియక, తన బాధను తోటి వారయిన కొందరు పెద్దలతో చెప్పుకున్నాడు.

ఇంతలో నవరాత్రి ఉత్సవాలు వచ్చాయి. రాజభవనంలో జరిగే పండిత గోష్ఠికి పిలుపు రాగా శివజ్ఞానపండితుడు వెళ్ళిపోయాడు. ఆయన లేకపోయినా పండితులు ఆయన ఇంట గోష్ఠి జరుపుతూనే వచ్చారు. వారి గోష్ఠిలో పార్వతి తల దూర్చుతూనే ఉన్నది.

ఒకనాడు పండితులు పార్వతి వింటూండగా ఒక వింత విషయం చెప్పుకున్నారు; పాతచెరువు గట్టున ఉన్న మండపంలో ఎవరో ఏదో రాశారట. దాన్ని చదవలేక ప్రతి ఒకరూ తలలు దించేసుకుని, వెళ్ళిపోతున్నారట.



ఈ మాట వినగానే పార్వతి, "దాన్ని నేను చదువుతాను! ఎంత కష్టమైనాసరే! ఒకరు రాసినది చదపలేకపోతే నేను శివజ్ఞాన పండితుడి కూతురినే కాను!" అన్నది దర్పంగా.

మండపంలో రాసి ఉన్నది పార్వతి చదవబోతున్నదన్న వార్త ఊరంతా పాకింది. ఊళ్ళో వాళ్ళంతా మండపం వద్దకు చేరారు. పార్వతి వచ్చి, గోడకు కట్టి ఉన్న తెరతొలగించి, ఇలా చదివింది:

"చెయ్యగల వాళ్ళే దీన్ని పైకి చదవాలి. ఈ చెరువులో పది అడుగుల బురద పేరుకుని ఉన్నది. నేను పారా, బుట్టా తీసుకుని, ఒంటరిగా ఈ బురద అంతా తీసేస్తాను. ఇందుకు మీరందరూ సాక్షులు."

ఆమె చదవటం పూర్తి చెయ్యగానే ఎవరో ఆమె ముందు పారా, బుట్టా తెచ్చిపెట్టారు.

"ఇవి ఏమిటి?" అన్నది పార్వతి ఆశ్చర్యంగా.

"చెరువులో బురద తీయి," అన్నారు అక్కడి వాళ్ళు.

"నేను చదువుతానన్నాను గాని, పని చేస్తాననలేదే?" అన్నదామె.

"మేమంతా చదవలేని శుంఠలమా, తల్లీ? దాన్ని చదివి వినిపించిన వాళ్ళు రాసినట్టు చెయ్యాలని ఉన్నది గద! అందుకే ఎవరమూ ఆ రాసినదాన్ని పైకి చదవలేదు. నువు ముందూ వెనకా చూడకుండా చదివేశావు. పారా, తట్టా తీసుకో. తప్పుతుందా?" అన్నారు పెద్దవాళ్ళు.

పార్వతి బావురుమని ఏడిచింది.

పెద్దవాళ్ళు ఆమెను ఓదార్చి, "తెలివితేటలు అంతో ఇంతో అందరికీ ఉంటాయి. కాని అసందర్భంగా ఎవరూ తమ తెలివితేటలను ఎప్పుడు బట్టితే అప్పుడు ప్రదర్శించ గూడదు," అని హితబోధ చేశారు.

శివజ్ఞానపండితుడు తిరిగివచ్చే సరికి పార్వతి పూర్తిగా మారిపోయింది. ఆమె అహంకారాన్ని అణచటానికి తన మిత్రులు చేసిన యుక్తి గురించి విని, తన కూతురు మారినందుకు ఆయన ఎంతో సంతోషించాడు.



# లంచగొండి

ఒక దేశంలో పత్తి బాగా పండేది. అయితే పొరుగు దేశాలవాళ్ళు దాన్ని హెచ్చు ధరకు కొనుక్కుపోవటం చేత దేశంలో పత్తిధర పెరగటమే గాక, దేశ అవసరాలకు తగినంత మిగిలేది కూడా కాదు.

అందుచేత రాజుగారు దేశంలో పత్తినిల్వలు తణిఖీ చెయ్యటానికీ, పైదేశాలకు పోయే పత్తి మీద సుంకాలు వెయ్యటానికి ఒక అధికారిని నియమించారు. ఆ అధికారి పత్తి పండించే రైతుల వద్ద లంచాలు పుచ్చుకుని, వారి చిత్తం వచ్చినట్టు పత్తిని ఎగుమతి కానిచ్చి, దొంగనిల్వ లెక్కలు తయారు చేశాడు. రాను రాను ఈ అధికారి అధికంగా లంచాలు అడగసాగాడు. రైతులకు అసలుకే మోసం వచ్చే పరిస్థితి ఏర్పడింది. అప్పుడు వాళ్ళు అందరూ కలిసి, పంటల మంత్రిగారి దగ్గిరికి వెళ్ళి, పత్తిఅధికారి పట్టి లంచగొండి అనీ, అతన్ని తొలగించి, మంచివాణ్ణి వెయ్యమనీ వేడుకున్నారు.

పంటల మంత్రి వారి పట్ల సానుభూతి చూపి, "మీరందరూ తలా ఒక వెయ్యి రూపాయలూ నాకు చెల్లించండి. నేను ఆ మనిషిని తీసేసి మరొక మనిషిని పత్తి తణిఖీకి నియమిస్తాను," అన్నాడు.

—మొగళ్ళపల్లి నాగరాజారావు





# ధర్మబుద్ధి

ఒకప్పుడు కోసలదేశంలో సిద్ధిస్వామి అనే ఒక ధర్మదాత ఉండేవాడు. అతను తన కున్నదానిలో అన్నార్తులకు విధిగా భోజనం పెట్టి పంపేవాడు. అతని దాతృత్వం గురించి అందరూ చెప్పుకోవటం విని కోసల రాజు, "అలాటి వాడికి సహాయం చెయ్యటం కూడా పుణ్యమే!" అనుకుని, సిద్ధిస్వామికి రోజూ తన ప్రాసాదం నుంచి సువారాలు పంపేవాడు.

సిద్ధిస్వామి భార్య హంసమతి అన్ని విధాలా భర్తకు తగిన భార్య. తమకు మిగలకపోయినా సరే, వచ్చిన వారికి ఎన్నడూ లేదు అనేది కాదు. నిరతాన్న ప్రదాతలుగా ఆ భార్యా భర్తలకు కోసల దేశమంతటా గొప్ప పేరు ప్రఖ్యాతులు వచ్చాయి. రాజుగారు నిత్యమూ పంపే సువారాల సహాయంతో వారు నిరాటంకంగా అన్నదానం చేస్తూ వచ్చారు.

ఇలా ఉండగా ఒకసారి కోసలరాజు సపరివారంగా తీర్థయాత్రకని కాశీ వెళ్ళాడు. అందరూ గంగాస్నానం చేసి ఒడ్డుకు వస్తూ ఉండగా, కొందరు భటులు, "రాజుగారు వస్తున్నారు, తప్పుకోండి!" అని కేకలు పెడుతూ జనాన్ని పక్కకు నెట్టసాగారు. వాళ్ళు కోసలరాజును కూడా అలాగే నెట్టారు.

అదిచూసి కోసల రాజభటులకు కోపం వచ్చి, "కోసలరాజంటే ఏమిటను కుంటున్నారు? కాశీరాజుకు ఇంత పొగరా?" అని గట్టిగా అరిచారు.

ఈ మాటలు కాశీరాజుకు వినిపించాయి. ఆయన తన గుర్రాన్ని ఆపి, కోసలరాజుకు నమస్కరించి, "సిద్ధిస్వామి ఉండే దేశానికి మీరు ప్రభువులని తెలియక మా భటులు అపచారం చేశారు. క్షమించండి," అన్నాడు.

ఈ మాటలు వినగానే కోసలరాజు మనస్సు చివుక్కుమన్నది. "నే నిచ్చే

విల్లూరి కాశీవిశ్వనాథం

సువారాలతో అన్నదానం చేసే సిద్ధిస్వామి నుంచి నాకు కీర్తి రావటమా?'' అనుకుని, ఆయన కాశీయాత్ర చప్పున ముగించుకుని కోసలకు తిరిగివచ్చాడు. వస్తూనే ఆయన సిద్ధిస్వామికి నిత్యమూ పోయే సువారాలు ఆపుచేశాడు.

కాని సిద్ధిస్వామీ, అతని భార్యా సువారాలు రావటం లేదని చింతించక, ఎప్పటిలాగే అతిధిసత్కారాలు చేస్తున్నారు. సిద్ధిస్వామికి అపఖ్యాతి కలిగించాలన్న ఉద్దేశంతో కోసలరాజు అతని ఇంటికి రోజూ అధిక సంఖ్యలో అతిథులను పంపసాగాడు.

సిద్ధిస్వామి తన ధర్మనిష్ఠ కొనసాగించటానికి తనకున్న ఆస్తి పాస్తులు క్రమంగా అమ్ముకోవలిసి వచ్చింది. ఆస్తి అంతా అయిపోయాక సిద్ధిస్వామి చందాలు వసూలు చెయ్యటానికి బయలుదేరాడు. ఆయన చేసే ధర్మంపట్ల ఆదరం ఉన్న వాళ్ళు ధనసహాయం చేశారు.

అయితే అదికూడా క్రమంగా క్షీణించింది. ఒక రోజు సిద్ధిస్వామికి అతి కష్టం మీద కుంచెడు బియ్యం మాత్రం దొరికాయి. అప్పటికే ఇరవైమంది అతిథులు కనిపెట్టుకునివున్నారు. సిద్ధిస్వామి దిగాలు పడ్డాడు.

అప్పుడు హంసమతి, తన మంగళసూత్రం తీసి తన భర్తకిచ్చి, తాను పసుపుకొమ్ము మెడకు కట్టుకుని, "విచారించకండి. పని పూర్తిచెయ్యండి," అన్నది. అతిథి సత్కారం నిర్విఘ్నంగా జరిగిపోయింది.



ఆ నాటితో సిద్ధిస్వామి వద్ద చిల్లిగవ్వ లేకుండా పోయింది. ఇక చేసేదిలేక ఆయన తన భార్యతో సహా కాశీ పోదామని బయలుదేరాడు.

ఆ రాత్రి వారు దారిలో ఒక సత్రంలో బస చేశారు. అదే సత్రానికి ఎవరో ముగ్గురు యాత్రికులు వచ్చి, మాటల సందర్భంలో, "ఈ కాలంలో యాత్రికులకు అన్నం పుట్టకుండా ఉన్నది. మేము కోసలదేశం పోయి, సిద్ధిస్వామిగారి ఆతిథ్యం పొందుదామని ఉవ్విళ్ళూరుతున్నాం. బాబూ, మీకు సిద్ధి స్వామిగారు తెలుసా?" అని అడిగారు.

ఈ మాటలు విని సిద్ధిస్వామీ, ఆయన భార్యా ఆశ్చర్యపోయారు.

"తెలుసు. ఆయన అక్కడే ఉన్నాడు. మీరు బయలుదేరి వెళ్ళండి," అన్నాడు సిద్ధిస్వామి వారితో.

ఆ ముగ్గురు యాత్రికులూ నిద్రపోయాక హంసమతి తన భర్తతో, "ఏమండీ, మనం ఇప్పుడే బయలుదేరి మన ఇంటికి పోయి, వీళ్ళు వచ్చేసరికి వీళ్ళకు భోజన సదుపాయాలు చెయ్యాలి. లేకపోతే మనకు అసత్యదోషం అంటుకుంటుంది," అన్నది.

"చిల్లిగవ్వలేదే! వీళ్ళకు భోజనం ఎలా పెడతాం?" అన్నాడు సిద్ధిస్వామి.

"ఫరవాలేదు. మన ఇంటో ఒక రోలూ, రెండు రోకళ్ళూ ఇంకా మిగిలి ఉన్నాయి. అవి అమ్మేద్దాం," అన్నది హంసమతి.

ఇద్దరూ వెంటనే తిరుగు ప్రయాణమై, తెల్లవారే సరికి ఇల్లు చేరుకున్నారు. అమ్మటానికి రోలు కదిలించేసరికి, దాని కింద వాళ్ళ పూర్వులు ఏనాడో దాచి ఉంచిన ధనపు బిందెలు ఆశ్చర్యంగా బయట పడ్డాయి!

ఆ రోజు వాళ్ళు ఆ ముగ్గురు యాత్రికులకేగాక, ఊళ్ళో అందరికీ గొప్ప సంతర్పణ చేశారు.

ఈ సంగతి కోసలరాజు దాకా వెళ్ళింది. తాను ఇవ్వకపోతే దేవుడే ఇవ్వవచ్చునని ఆయనకు తట్టలేదు. కాని ఇప్పుడదే జరిగే సరికి కోసలరాజు పశ్చాత్తాపపడి, ఎప్పటి లాగే సువారాలు పంపటం ప్రారంభించాడు.





# మహాభారతం

యుద్ధం ఏడోరోజు తెల్లవారింది. కౌరవ సేనలను భీష్ముడు మండల వ్యూహంలో నిలబెట్టాడు. ధృతరాష్ట్రుడి కొడుకులు అనేక వేల రథాలూ, ఏనుగులూ గల సేనతో భీష్ముడికి రక్షకులుగా ఉన్నారు.

కౌరవవ్యూహాన్ని చూసి ధర్మరాజు తన సేనలను వజ్రం అనే వ్యూహంలో అమర్చాడు. యుద్ధం ఆరంభం కాగానే యోధులు ఒకరి వ్యూహాన్ని ఒకరు ఛేదించనారంభించారు. ద్రోణుడు విరాటుడితోనూ, అశ్వత్థామ శిఖండితోనూ, దుర్యోధనుడు ధృష్టద్యుమ్నుడితోనూ, నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితోనూ, విందాను విందులు ఇరావంతుడితోనూ, అనేక మంది కౌరవ వీరులు అర్జునుడితోనూ, భీముడు కృతవర్మతోనూ, అభిమన్యుడు ధృతరాష్ట్రుడి కొడుకులైన చిత్రసేన, వికర్ణ, దుర్మర్షణులతోనూ, ఘటోత్కచుడు భగదత్తుడితోనూ, అలంబుసుడు సాత్యకితోనూ, భూరిశ్రవుడు ధృష్టకేతుడితోనూ, ధర్మరాజు శ్రుతాయువుతోనూ యుద్ధంచేశారు.

అర్జునుడితో యుద్ధం చేస్తున్న వీరులు అతని పైన బాణవర్షం కురిపించారు. అర్జునుడు మండిపడి ఐంద్రాస్త్రం ప్రయోగించాడు. ఆ అస్త్రంతో అతనికి ఎదురుగా పోరాడుతున్న వారందరూ గాయపడ్డారు. అతని బాణాలు అంతటా పడుతున్నాయి. వాటి తాకిడికి తట్టుకో లేక కౌరవవీరులు భీష్ముణ్ణి శరణుజొచ్చారు.

**57. ఇరావంతుడి మరణం**



అలా వచ్చిన వారిలో ముఖ్యుడైన సుశర్మతో దుర్యోధనుడు, "భీష్ముడు అర్జునుడితో ప్రాణాలొడ్డి పోరాడ బోతున్నాడు. మీ రందరూ ఆయనకు అండగా ఉండండి," అన్నాడు.

త్వరలోనే, కౌరవ వీరులను వెంట బెట్టుకుని భీష్ముడు అర్జునుడి మీద యుద్ధానికి వచ్చాడు.

ఈ లోపల విరాటుడితో యుద్ధం చేసిన ద్రోణుడు ముందు విరాటుడి సారథిని, గుర్రాలను చంపాడు. తరవాత విరాటుడు తన కొడుకైన శంఖుడి రథం ఎక్కి, తండ్రి కొడుకు లిద్దరూ యుద్ధం చేసేటప్పుడు, ద్రోణుడు ఒక్క బాణంతో శంఖుణ్ణి చంపేశాడు. అది చూసి విరాటుడు పారిపోయాడు.

అలాగే శిఖండితో యుద్ధం చేస్తూ అశ్వత్థామ అతని సారథినీ, గుర్రాలనూ చంపాడు. అప్పుడు శిఖండి కత్తి తీసుకుని, ఎంతో నేర్పుగా, అశ్వత్థామ తనపై ప్రయోగించే బాణాలన్నిటినీ ధ్వంసం చెయ్యసాగాడు. చివరకు శిఖండి చేతిలోని కత్తి విరిగిపోయింది. అతను దాన్ని అశ్వత్థామ పైకి విసిరి, తప్పించుకుపోయాడు.

అలంబుసుడితో సాత్యకి అద్భుతంగా పోరాడాడు. రాక్షసుడైన అలంబుసుడు మాయాయుద్ధం ఆరంభించే సరికి, సాత్యకి, అర్జునుడు తనకిచ్చిన ఐంద్రాస్త్రాన్ని ప్రయోగించాడు. అలంబుసుడు తీవ్రంగా గాయపడి పారిపోయాడు.

ధృష్టద్యుమ్నుడు దుర్యోధనుడితో యుద్ధం చేస్తూ, అతన్ని బాణవర్షంలో ముంచాడు; తరవాత దుర్యోధనుణ్ణి గాయపరిచి, అతని గుర్రాలను చంపాడు. దుర్యోధనుడు కత్తి తీసుకుని, రథంనుంచి దిగి, ధృష్టద్యుమ్నుడి మీదికి వచ్చాడు. ఇంతలో శకుని వచ్చి, దుర్యోధనుణ్ణి తన రథంలో ఎక్కించుకుని తీసుకుపోయాడు.

భీముడితో యుద్ధం చేసిన కృతవర్మ భీముణ్ణి గాయపరిచి, తాను గాయపడి, తన గుర్రాలను పోగొట్టుకుని, తన బావ

అయిన వృషకుడి రథం ఎక్కాడు. ఇది దుర్యోధనుడి కళ్ళ ఎదటే జరిగింది.

ఉలూపికీ, అర్జునుడికీ పుట్టిన కొడుకు, తనతో యుద్ధం చేసిన విందాను విందులను పారిపోయే దాకా బాణాలతో కొట్టాడు.

ఘటోత్కచుడికీ, భగదత్తుడికీ మధ్య యుద్ధం చిత్రంగా జరిగింది. భగదదత్తుడు పెద్ద ఏనుగు నెక్కి పాండవ సైన్యాన్ని చిందర వందర చేశాడు. తమను కాపాడే వాడెవడూ లేక పాండవ సేనలు పారిపో సాగాయి. ఘటోత్కచుడు అకస్మాత్తుగా మాయమయాడు. ఇంతలో కౌరవ సేనలో హాహాకారాలు చెలరేగాయి. ఘటోత్కచుడు మళ్ళీ కనిపించి, భగదత్తుడి మీద బాణవర్షం కురిపించాడు. భగదత్తుడు ఘటోత్కచుణ్ణి బాణాలతోనూ, తోమరాలతోనూ కొట్టాడు. చివరకు ఘటోత్కచుడు యుద్ధం చెయ్యలేక పారిపోయాడు.

నకుల సహదేవులు తమ మేనమామ అయిన శల్యుడితో యుద్ధం చేసి, మహా వీరుడైన ఆయనను మూర్ఛపోగొట్టారు. శల్యుడి రథాన్ని సారథి దూరంగా తీసుకు పోయాడు. నకుల సహదేవులు గెలిచి సింహ నాదాలు చేస్తూంటే కౌరవులు నిరుత్సాహం చెందారు. అప్పటికి మధ్యాహ్నమయింది.

అభిమన్యుడికీ, ధృతరాష్ట్రుడి కొడుకులకూ జరిగిన యుద్ధంలో అభిమన్యుడు




చిత్రసేన, వికర్ణ, దుర్మర్షణులు ముగ్గురి రథాలూ ధ్వంసం చేశాడు. అది చూసి అభిమన్యుడి పైకి కౌరవయోధులు వచ్చి పడ్డారు. అప్పుడు అభిమన్యుడికి సహాయంగా అర్జునుడు వేగంగా వచ్చాడు. రెండు పక్షాలకూ సంకుల యుద్ధం జరిగింది. అర్జునుడి బాణాలు అందరినీ బాధించాయి. సుశర్మ బంధువులు చాలామంది అర్జునుడి చేతిలో చచ్చారు. సుశర్మ కొంత మంది యోధులను వెంట బెట్టుకుని అర్జునుడి పైకి వచ్చాడు.

అర్జునుడు వారినందరినీ ఓడించి, భీష్మణ్ణి ఎదిరించటానికి ముందుకు సాగాడు. మధ్యదారిలో అతను రెండు



ధర్మరాజు శిఖండి వద్దకు వెళ్ళి, "నువు భీష్ముణ్ణి చంపుతానన్నావు. భీష్ముడు చూడు, ఎలాటి దారుణయుద్ధం చేస్తున్నాడో! నాకు చూడగా నువు భీష్ముడంటే బెదిరి నట్టు కనిపిస్తున్నది. వచ్చి భీష్ముణ్ణి చంపు," అన్నాడు.

ఈ మాటలు విని శిఖండి భీష్ముడితో యుద్ధం చెయ్యటానికి బయలుదేరాడు. దారిలో శల్యుడు శిఖండి మీద దారుణమైన ఆగ్నేయాస్త్రం ప్రయోగించాడు. శిఖండి బెదరక, దానికి ప్రతిగా వారుణాస్త్రం ప్రయోగించాడు.

ఈ లోపల భీష్ముడు ధర్మరాజు విల్లునూ, ధ్వజాన్నీ విరగగొట్టి, సింహనాదం చేశాడు. ధర్మరాజు బెదిరిపోయాడు.

గడియలసేపు దుర్యోధన, సైంధవులు మొద లైన వారితో యుద్ధం చెయ్యవలిసి వచ్చింది.

అర్జునుడు భీష్ముణ్ణి చేరవచ్చే సరికి అక్కడికి ధర్మరాజూ, భీమ నకుల సహ దేవులు కూడా వచ్చారు. ఆ విధంగా పాండవులు అయిదుగురూ భీష్ముడితో ఒకే సారి తలపడటం జరిగింది.

అంతమందీ కలిసి కూడా భీష్ముణ్ణి పీడించలేక పోయారు. ఇంతలో సైంధవుడు వచ్చి, పాండవుల విల్లులన్నీ ఖండించాడు. దుర్యోధనుడు ధర్మరాజునూ, నకుల సహదేవులనూ బాణాలతో కొట్టి బాధించాడు. శల్యుడు మొదలైన కౌరవ పక్షయోధులు పాండవులను తీవ్రంగా బాణాలతోకొట్టారు.

భీముడు గద తీసుకుని సైంధవుడి మీదికి వెళ్ళాడు. సైంధవుడు తనపై వేసే బాణాలను లక్ష్యపెట్టక, అతని గుర్రాలను గదతో మోది చంపాడు. అప్పుడు దుర్యో ధనుడు భీముడి మీదికి వచ్చాడు. భీముడు గద తీసుకుని అతని మీదికి కూడా వెళ్ళాడు. ఆ గదను తప్పించుకోవటానికి దుర్యోధనుడి మనుషులు, దుర్యోధనుణ్ణి ఒంటరిగా విడిచి, బెదిరి పారిపోయారు. అలా భీముడి గద దెబ్బనుండి తప్పించుకుని, నేలమీద దూకి, రథం ధ్వంసం కాగా, ప్రాణాలతో బయట పడిన చిత్రసేనుణ్ణి అందరూ అభినం

దించారు. ధృతరాష్ట్రుడి కొడుకైన వికర్ణుడు చిత్రసేనుణ్ణి తన రథం మీద ఎక్కించుకున్నాడు. కొంత సేపటికి శిఖండి భీష్ముడికి ఎదురుగా వచ్చి, "నిలు, నిలు!" అని కేక పెట్టాడు. కాని భీష్ముడు అతనితో యుద్ధం చెయ్యలేదు.

సూర్యాస్తమయం కావచ్చేవేళకు ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ కౌరవ బలాలను విపరీతంగా ధ్వంసం చేయనారంభించారు. అప్పుడు విందానువిందులు ధృష్టద్యుమ్నుణ్ణి ఎదిరించి, అతని రథాన్ని భగ్నం చేశారు. అతను సాత్యకి రథం ఎక్కాడు.

ఆ రోజు యుద్ధం ముగిసేలోపల అర్జునుడు సుశర్మ మొదలైనవారిని ఓడించాడు; భీముడు దుర్యోధనుడు మొదలైన వారిని జయించాడు. ఉభయ పక్షాలవారూ తమ తమ శిబిరాలకు వెళ్ళిపోయారు. శిబిరాలు చేరగానే వాళ్ళు తమ శరీరాలలో గుచ్చుకున్న బాణాలు మొదలైనవి తీయించుకుని, చక్కగా స్నానాలు చేసి, యుద్ధం గురించి ఆలోచించటం మాని, కొంత సేపు గీత వాద్యాలను సుఖంగా అనుభవించారు.

మర్నాడు ఉదయం మళ్ళీ ఉభయ సేనలూ యుద్ధానికి ఉపక్రమించాయి. వ్యూహాలూ, ప్రతివ్యూహాలు పన్నిన అనంతరం యుద్ధం ఆరంభమయింది. ఆరంభం నుంచీ భీష్ముడు రుద్రుడు లాగా తయా



రయాడు. అది చూసి ధర్మరాజు ముఖ్య యోధులందరినీ భీష్ముడి మీదికే పంపాడు.

భీష్ముడు సోమకులనూ, సృంజయులనూ, పాంచాలులనూ వధించసాగాడు. ఆయనకు ఎదురుగా నిలబడి యుద్ధం చేసినవాడు భీముడు ఒకడే. అతను కూడా భీష్ముడంత భయంకరంగానూ ఉండటమే కాక, భీష్ముడి సారథిని చంపి, భీష్ముడి రథం తొలగిపోయేటట్టు చేసి, భీష్ముడికి అండగా యుద్ధం చేస్తున్నవారిలో ధృతరాష్ట్రుడి కొడుకులైన సునాభుడు అనే వాణ్ణి ఒక్క తీవ్రమైనబాణంతో తల నరికాడు.

అది చూసి ధృతరాష్ట్రుడి కొడుకులు మరి ఏడుగురు—ఆదిత్యకేతువూ, బహ్వాశీ,



కుండధారుడూ, మహోదరుడూ, పండితకుడూ, అపరాజితుడూ, విశాలాక్షుడూ అనేవారు—భీముడి పైకి వచ్చారు. భీముడు ఆ ఏడుగురినీ బాణాలతో కొట్టి చంపాడు.

ఇది చూసి దుర్యోధనుడి మిగిలిన తమ్ములకు దడపుట్టింది. దుర్యోధనుడు దుఃఖిస్తూ భీష్ముడి వద్దకు వెళ్ళి, "తాతా, నా తమ్ములందరినీ భీముడు చంపేస్తున్నాడు. ధైర్యంగా నిలబడి పోరాడేవాళ్ళందరినీ భీముడు చంపుతున్నాడు. నువు మా పట్ల శ్రద్ధవహించటం లేదు," అన్నాడు.

భీష్ముడికి కోపం వచ్చింది. ఆయన ఏడుస్తున్న దుర్యోధనుడితో, "ఈ సంగతి ముందు నీకు తెలీదా? మేమంతా ముందే చెప్పలేదా? నీ తమ్ములు ఎవరు దొరికినా భీముడు చంపక విడవడు. నన్నూ, ద్రోణుణ్ణీ ఈ యుద్ధంలో ఇరికించకుండా ఉండవలిసింది. నువే నీ పరాక్రమంతో పాండవులను చంపు," అన్నాడు.

మధ్యాన్నం వేళకు యుద్ధం చాలా తీవ్రస్థాయికి వచ్చింది. మహాదారుణమైన యుద్ధం చేస్తున్న భీష్ముడి మీదికి ధృష్టద్యుమ్నుడూ, సాత్యకీ, శిఖండీ తమ సేనలతో సహా వచ్చారు. అలాగే విరాటుడూ, ద్రుపదుడూ సోమకులను వెంటబెట్టుకుని వచ్చారు. ఇంకా కైకయులూ, ధృష్టకేతువూ, కుంతిభోజుడూ తమ సేనలతో భీష్ముడి పైకి వచ్చారు. అర్జునుడూ, ఉపపాండవులూ, చేకితానుడూ ఇతర కౌరవ యోధులతో యుద్ధం చేశారు. అభిమన్యుడూ, భీముడూ, ఘటోత్కచుడూ మరొక పక్కనుంచి కౌరవ సైన్యాన్ని ధ్వంసం చెయ్యసాగారు.

కౌరవయోధులు అదే విధంగా పాండవ సేనను నాశనం చేశారు. ద్రోణుడు సోమక సృంజయులను వధచేశాడు. భీముడి చేత చచ్చే కౌరవసేనలూ, ద్రోణుడి చేత చచ్చే పాండవసేనలూ హాహాకారాలు చెయ్యటం వినిపించింది. ముమ్మరంగా సాగే ఆ యుద్ధంలో అర్జునుడి కొడుకైన ఇరావంతుడు కౌరవసేనపై విరుచుకు పడ్డాడు.

ఇరావంతుడి తల్లి, నాగరాజైన ఐరావతుడి కూతురు. ఆమె భర్తను గరుత్మంతుడు చంపేసిన మీదట, ఐరావతుడు ఆమెను అర్జునుడి వద్దకు పంపాడు. ఆమె అర్జునుణ్ణి మోహించి, అతని వల్ల ఈ ఇరావంతుణ్ణి కన్నది. ఇరావంతుడు నాగలోకంలోనే తల్లి వద్ద పెరుగుతూ వచ్చాడు. కాని ఇతని పినతండ్రి అయిన అశ్వసేనుడికి అర్జునుడిపై ద్వేషం ఉండేది. అందుచేత అశ్వసేనుడు ఇరావంతుణ్ణి నాగలోకం నుంచి వెళ్ళగొట్టాడు.

ఆ స మ యం లో అర్జునుడు ఇంద్రలోకంలో ఉన్నాడు. ఆ సంగతి తెలిసి ఇరావంతుడు అక్కడికి వెళ్ళి, అర్జునుణ్ణి కలుసుకుని, తన పుట్టుపూర్వోత్తరాలు తెలిపాడు. అన్ని విధాలా తన అంతవాడైన ఇరావంతుణ్ణి చూసి అర్జునుడు చాలా సంతోషపడి, "యుద్ధం వచ్చినప్పుడు నువ్వు మాకు సహాయం రావాలి, అన్నాడు. ఆ మాట గుర్తుంచుకుని ఇరావంతుడు పాండవులకు యుద్ధ సహాయం చెయ్యటానికి మేలు జాతి యవనాశ్వాలను వెంటబెట్టుకుని వచ్చాడు.

ఇరావంతుడు తన అశ్వసేనతో విజృంభించి కౌరవ సేన మీదికి వచ్చేసరికి, శకుని తమ్ములైన గజుడూ, గవాక్షుడూ, వృషభుడూ, చర్మవంతుడూ, ఆర్జవుడూ, శుకుడూ అనే అరుగురు, శకుని వద్దంటున్నా వినకుండా సాహసించి, ఇరావంతుడి అశ్వసేనతో యుద్ధానికి వచ్చారు. వాళ్ళు తనతో యుద్ధంచేసి తనను బాణాలతో హింసిస్తుంటే, ఇరావంతుడు కత్తి తీసుకుని ఆత్మరక్షణ చేసుకుంటూ, వృషభుడనే వాణ్ణి తప్ప మిగిలిన అయిదుగురినీ చంపేశాడు.

ఇది చూసి దుర్యోధనుడు ఇరావంతుడిపైకి ఆర్ష్యశృంగుడనే రాక్షసుణ్ణి యుద్ధానికి పంపాడు. ఇద్దరూ మహాదారుణంగా పోరాడిన మీదట, ఇరావంతుడు మూర్ఛపోయి ఉన్నప్పుడు ఆ రాక్షసుడు అతన్ని కత్తితో నరికి చంపాడు. కౌరవసేనలు హర్షించాయి.





# మిత్రభేదం

## 6

కరటకం దమనకానికి ఆషాఢభూతి పలాయనం విషయం చెప్పి. ఇంకా ఇలా చెప్పసాగింది:

ఆషాఢభూతి మీద పూర్తి నమ్మకంతో తన కాలకృత్యాలు నిర్వర్తించటానికి అవతలికి వెళ్ళిన దేవశర్మ తన సమీపంలోనే ఒక దృశ్యం చూశాడు. పొటేళ్ళమంద ఒకటి మేత మేస్తున్నది. అందులో రెండు పొటేళ్ళు పోట్లాడ సాగాయి. అవి రెండూ పరిగెత్తుకుంటూ వచ్చి, తలలు ఢీ కొట్టుకుని, మళ్ళీ వెనక్కు వెళ్ళి పరిగెత్తుకుంటూ వచ్చి బలంగా తలలు ఢీ కొట్టుకుంటున్నాయి. వాటి తలలు పగిలి రక్తం నేల మీద కారుతున్నది. నేల మీద కారిన రక్తాన్ని నాకాలన్న ఆత్రంతో ఒక నక్క వచ్చింది. పొటేళ్ళు ఆ సమయంలో ఎడంగా వెళ్ళాయి.

దేవశర్మ ఆ నక్కను చూసి, "ఈ నక్కకు బుద్ధిలేదు. ఈ సారి పొటేళ్ళు తలలు ఢీ కొట్టినప్పుడు ఇది నిశ్చయంగా వాటి మధ్య నలిగి చస్తుంది," అనుకున్నాడు.

ఆయన అనుకున్నట్టే పొటేళ్ళు మళ్ళీ పరిగెత్తుకుంటూ వచ్చి తలలు మోటించాయి. రక్తం తాగటంలో మైమరచి ఉన్న నక్క ఆ పొటేళ్ళ తలల మధ్య నలిగి చచ్చింది.

చచ్చిన నక్క గురించి చింతిస్తూ దేవశర్మ తన శిష్యుడు ఉండిన చోటికి వచ్చాడు. ఆషాఢభూతి కనిపించలేదు. దేవశర్మ గబగబా స్నానం చేసి వచ్చి చూసేసరికి ఆయన బట్టలమూట ఉన్నది గాని, బంగారం మూట లేదు.

"అయ్యో, నా బంగారం పోయింది." అంటూ దేవశర్మ మూర్ఛపోయాడు. కొద్ది



సేపటికి స్పృహ వచ్చి ఆయన, "ఒరే, ఆషాఢభూతీ! నన్ను మోసగించి ఎక్కడికి పోయావురా? జవాబు చెప్పరా!" అని వైన వైనాలుగా ఏడుస్తూ, వాణ్ణి కలుసుకుందా మనే ఆశతో, వాడి అడుగు జాడలను బట్టి బయలుదేరాడు.

సాయంకాలం అయే సరికి ఆయన ఒక గ్రామం చేరాడు. కల్లు అంగడికి పోతున్న సాలెదంపతులు ఆయనకు కనిపించారు. ఆయన సాలెవాడితో, "నాయనా, అసుర సంధ్యవేళ నేను నీకు అతిథిగా వచ్చాను. నాకు ఇక్కడ ఎవరూ తెలియదు. అందు చేత నన్ను అతిథిగా స్వీకరించి, ఆతిథ్యం ఇయ్యి," అన్నాడు.

ఈ మాటలు విని సాలెవాడు తన భార్యతో, "ఏమే, ఈయనను మన ఇంటికి తీసుకుపోయి, కాళ్ళు కడిగి, భోజనంపెట్టి, పక్క వేసి ఆయనకు ఏం కావాలో చూస్తూ ఇంటి దగ్గిరే ఉండు. నేను వెళ్ళి నీకు ఇంత మాంసమూ, కల్లూ తెస్తాను," అన్నాడు.

సాలెవాడి భార్య కులట. తన ప్రియుడైన దేవదత్తుణ్ణి కలుసుకోవటానికి మంచి అవకాశం దొరికినందుకు పరమానంద భరితురాలై ఆమె దేవశర్మను వెంటబెట్టుకుని ఇంటికి బయలు దేరింది.

ఇంటికి చేరగానే ఆమె దేవశర్మకు ఒక కుక్కమంచం చూపి, "నా స్నేహితురాలు ఒకతె ఇవాళే వాళ్ళ గ్రామంనుంచి వచ్చింది. దానితో మాట్లాడి ఇప్పుడే వస్తాను. నేను వచ్చేదాకా ఇల్లు కాస్త చూస్తూ ఉండండి," అని, మంచి బట్టలూ, నగలూ ధరించి, దేవదత్తుణ్ణి కలుసుకోవటానికి వెళ్ళింది.

కాని దారిలో ఆమెకు తన భర్త, తప్ప తాగి తూలుతూ, అడుగులు తడబడుతూ, జుట్టురేగి, చేతిలో కల్లుముంత పట్టుకుని వస్తూ కనిపించాడు. అది చూసి ఆమె అతి వేగంగా ఇంటికి పరిగెత్తుకుని వచ్చి, తన మంచి బట్టలూ, అలంకారాలూ తీసేసి, పాత బట్టలు ధరించింది. అయితే ఆమె మంచి బట్టలూ, అలంకారాలూ ధరించి పరిగెత్తిపోతూ ఉండటం సాలెవాడు చూసి

కూడా చూడనట్టు నటించాడు. తన భార్య తిరుగుళ్ళను గురించి అతడెరుగును.

అతను ఇంటికి వచ్చి భార్యను చూసి, పట్టరాని కోపంతో, "ఓసీ, నీచురాలా! కులటా! ఎక్కడికి పోతున్నావు?" అన్నాడు.

"నిన్ను వదిలినాక నేను ఎక్కడికీ పోలేదే? ఎందుకా తాగుడు వాగుడు? తాగిన వాడి నోటికి శుద్ధీ, బుద్ధీ ఉండదంటారు." అన్నది అతని భార్య.

తన భార్య పొగరు మాటలు విని, ఆమె చీరమార్చి ఉండటం గమనించి సాలెవాడు, "నీ పోకిళ్ళు గురించి అదివరకే విన్నాలే. ఇవాళ కళ్ళారాచూశాను. నిన్ను ఏం చేస్తానో చూడు!" అంటూ ఒక దుడ్డుకర్ర తీసుకుని తన భార్య ఒళ్ళంతా హూనంచేసి, ఆమెను స్తంభానికి పలుపుతో కట్టేసి, తాగిన మైకంలో పడుకుని నిద్రపోయాడు.

ఈ సాలెవాడి భార్యకు తిరుగుళ్ళు మరిగిన స్నేహితురాలు మంగలిది ఒకతె ఉన్నది. ఆమె వచ్చి, సాలెవాడు నిద్ర పోతున్నాడని రూఢి చేసుకుని, అతని భార్యతో, "దేవదత్తుడు నీ కోసం కనిపెట్టుకుని ఉన్నాడు. త్వరగా వెళ్ళు." అన్నది.

"నేను ఎలా వెళ్ళేది? ఏ స్థితిలో ఉన్నానో చూడు. నన్ను పలుపుతో కట్టేశాడు. నా మొగుడేమో ఇంటోనే ఉన్నాడాయె." అన్నది సాలెవాడి భార్య.



"నేను నిన్ను విప్పుతాను. నీ మొగుడు రేపు మొహం మీద ఎండ పడినదాకా లేవడు. అంతగా అయితే నీకు బదులు నన్ను కట్టు. నీ మొగుడు ఒక రాత్రివేళ లేచినా మైకంలో నన్ను చూసి నువే అనుకుంటాడు. నువు దేవదత్తుడి వద్దకు వెళ్ళి త్వరగారా." అన్నది స్నేహితురాలు.

సాలెవాడి భార్య తన కట్లు విప్పించుకుని, తన స్థానంలో తన స్నేహితురాలిని స్తంభానికి కట్టి, దేవదత్తుణ్ణి కలుసుకోవటానికి వెళ్ళింది.

ఆమె వెళ్ళిన కొంతసేపటికి సాలెవాడు శాంతపడి లేచి, "ఒసే, గయ్యాళి గంపా! ఇక ముందు ఇల్లు కదలననీ, నాతో పొగ

రుగా మాట్లాడననీ మాట ఇస్తే నీ కట్లు విప్పుతాను," అన్నాడు.

మంగలి మనిషి, తన గొంతు గుర్తిస్తా డని, సాలెవాడికి సమాధానం చెప్పలేదు. సాలెవాడికి ఒళ్ళు మండి, పదునైన కత్తి తెచ్చి, మంగలిదాని ముక్కు కోసి, "ఎప్ప టికీ ముక్కిడి ముండవుగా ఉండిపో," అని మళ్ళీ వెళ్ళి నిద్రపోయాడు.

బంగారాన్ని పోగొట్టుకున్న బాధకు ఆకలీ, దప్పితోడై, నిద్రపోలేకుండా ఉన్న దేవశర్మ ఈ నాటకమంతా కళ్ళారా చూశాడు.

కొంతసేపు గడిచాక సాలెమనిషి తిరిగి వచ్చి మంగలి మనిషిని, "ఎలా ఉన్నావు? నేను వెళ్ళినాక ఆ దుర్మార్గుడు లేచాడా?" అని అడిగింది.

"నేనైతే బాగానే ఉన్నాను గాని, నీ మాయదారి మొగుడు లేచి, నా ముక్కు కోశాడు. వాడు లేచి నా చెవులు కూడా కోసే లోపల, కట్టు విప్పి నన్ను ఇంటికి పోనీ," అన్నది మంగలి మనిషి.

సాలెమనిషి మంగలిదాని కట్లు విప్పి, దాని స్థానంలో తాను కట్టించుకున్నది. తరవాత ఆమె భర్తను ధిక్కరిస్తూ, "ఓ మూఢుడా! నా వంటి శీలవతిని గాయ పరచటమూ, వికృతం చెయ్యటమూ నీ తరమా? ఓ దిక్పాలకులారా! సూర్య చంద్రులారా! అగ్నిహోత్రుడా! వాయు దేవుడా! వినండి! నేనే పతివ్రతనైతే నా ముక్కును యథాప్రకారం చెయ్యండి!.. చూశావా, దుర్మార్గుడా? నా శీలబలం చేత నా ముక్కు ఎప్పటిలాగే అయింది!" అన్నది.

తన భార్య అబద్ధం ఆడుతూంటే దాన్ని అగ్నికి ఆహుతి చేద్దామని, సాలెవాడు మండే కొరివితో వచ్చి, తన భార్య ముక్కు ఎప్పటి లాగే ఉండటం చూసి నిర్ఘాంత పోయాడు. తాను నిజంగా ముక్కు కోయ లేదేమో అనుకుందామంటే నేల మీద రక్తం మడుగు ఉన్నది. అతను వెంటనే ఆమె కట్లు విప్పి, ఆమెకు వెయ్యి క్షమాప ణలు చెప్పుకుని, ఆమెను సంతోష పెట్ట టానికి సర్వవిధాలా యత్నించాడు.



# 144. ఎత్తయిన పొగగొట్టం

మంటానా (అమెరికా) లోని అనకొండాలో కొండ మీద ముడిరాగిని కరిగించే బట్టీలున్నాయి. వాటి పొగను తీసుకుపోయే ఈ పొగగొట్టం ప్రపంచంలో కెల్లా ఎత్తయినది. దాని ఎత్తు 585 అడుగులు. అప్పుడప్పుడూ ఇన్‌స్పెక్టర్లు ఉక్కుమెట్ల మీదుగా పైకి ఎక్కుతారు. పైకి వెళ్ళినప్పుడు గాలి గట్టిగా వీస్తుంటే గొట్టం ఊగుతున్న దనిపిస్తుందట. ఈ గొట్టాన్ని ఇటుకలతో కట్టారు. దీని నుంచి వచ్చే పొగ విషపూరితమైనది.



Photo by Dilip Banerje



బహుమతి
పొందిన వ్యాఖ్య

నడిచే దారుల గమ్యమొక్కటే

పంపినవారు :
ఎం. భానుమూర్తి



తిలక్‌నగర్,
కాశీబుగ్గ.

నడిపే వానికి అందరొక్కటే

బహుమతి
పొందిన వ్యాఖ్య

# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు







★ వ్యాఖ్యలు డిసెంబర్ నెల 20 వ తేదీలోగా చేరాలి.

★ వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు ఫిబ్రవరి నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

## ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట: పని

మూడవ అట్ట: తీరిక

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Chandamama Publications, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor : 'CHAKRAPANI'

## చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

# ఊరికే సరదాకి చికెలెట్స్® నేస్తగాడు

ఉన్న చోటుకు చేరండి
మరియు బహుమానములను
గెలుచుకోండి — అందరికీ
బహుమానములు లభిస్తాయి.



చిక్‌లెట్స్ నేస్తగాని చేరుటకు దగ్గర దారి చూపెట్టడమే మీరు చేయవలసినదంతా. అది ఎంతో తేలిక. వెంటనే మొదలు పెట్టండి. తొందరగా ఆ దారి పేరు గుర్తు పెట్టండి. నేస్తగాని చేరుటకు దారి చూపడము అవగానే, క్రింద ఉన్న అసంపూర్తి వాక్యమును 8 మాటలకు మించకుండా ఇంగ్లీషులో వ్రాసి పూర్తి చేసి, ఈ ప్రవేశ పత్రమును "CHICLETS CONTEST" అని వ్రాసి Post Box 9116, Bombay 25. పత్రమునకు పంపండి.

I like Chiclets best because..............................

..............................

Name ..............................

.............................. Age ..........

Address..............................

..............................

Dealers' name and address..............................

..............................

**మొదటి బహుమానము** ఫిలిప్స్ స్టీరియో సిస్టమ్ (17 కిల్లర్ స్పీకర్లతో)

**4** రెండవ బహుమానములు ఫిలిప్స్ పోర్టబుల్ రికార్డ్ ప్లేయర్లు

**20** మూడవ బహుమానములు ఫిలిప్స్ పోర్టబుల్ ట్రాన్సిస్టర్లు

త్వరపడండి! పిల్లలు ఎక్కువ ఉత్సాహము చూపిన కారణముగా ముగింపు తేది డిసెంబరు 31, 1973 వరకు పొడిగించబడినది.

**పోటీకి నిబంధనలు:**

1. ఈ పోటీలో వార్నర్-హిందూస్థాన్ లిమిటెడ్ మరియు వారి అడ్వర్టైజింగ్ ఏజెన్సీల ఉద్యోగుల పిల్లలు తప్ప మిగతా అందరు పిల్లలూ పాల్గొన వచ్చును.
2. పోటీదారులు ఎన్ని ప్రవేశ పత్రములనైనా పంపవచ్చును. కాని ప్రతి ప్రవేశ పత్రముతో 12 చిక్‌లెట్స్ 6 బ్లాక్ కార్డులు లేక 2 చిక్‌లెట్స్ 30 బ్లాక్ ప్యాకెట్లు జతచేసి పంపాలి.
3. ప్రవేశ పత్రమును ఇంగ్లీషులో పూర్తిచేయాలి.
4. అస్పష్టముగా పూర్తిచేయని లేక తక్కువ స్టాంపులు అంటించిన లేక స్టాంపులు అంటించని ప్రవేశ పత్రములు అంగీకరించబడవు.
5. ఈ పోటీ వ్యక్తిగతమైన నిర్ణయాధికారులచే పరిశీలించబడుతుంది. వారి నిర్ణయము తుది నిర్ణయము మరియు దానికి అందరూ బద్ధులై ఉండాలి.
6. పోటీ విషయములో ఉత్తర ప్రత్యుత్తరములు జరపబడవు.

ప్రతి పోటీదారునికి చిక్‌లెట్స్ ఫన్ ఆల్బమ్ ఉచితముగా పంపబడుతుంది.

గెలుపొందిన వారి పేర్లు యిప్పుడు యీ పత్రిక ఏప్రిల్ సంచికలో ప్రకటింపబడతాయి.



తప్పక చూడండి!
'మా పిల్లల భవిష్యత్తు అశ్రద్ధ చేయబడింది!'
శ్రీ కల్పనాలయా వారి
మేమూ మనుష్యులమే!
నిర్మాత: వాసంతి B.A., దర్శకత్వం: కె. బాపయ్య
శ్రీఖిలింస్
Veekay






*Photo by:* **SAMBHU MUKHERJEE**

